## సంపాదకీయం



శ్రీ అటల్ బిహారి వాజ్‌పాయిగారు రెండు రోజుల సుదీర్ఘ చర్చ తరువాత లోక్‌సభ విశ్వాసాన్ని పొందారు. శ్రీ వాజ్‌పాయిగారి నేతృత్వంలో బి.జె.పి. సంకీర్ణ ప్రభుత్వం పూర్తికాలం పాటు సుస్థిరమైన స్వచ్ఛమైన, సమర్ధవంతమైన పాలనను అందిస్తుందని ఆశిద్దాం. ఒక విధంగా ఆలోచిస్తే శ్రీ వాజ్‌పాయిగారికి ఇది ఒక అగ్ని పరీక్ష. అడుగడుగునా సంభవించే ఒత్తిళ్ళకు, బెదిరింపులకు తట్టుకొని, ఓర్పుతో, ఓర్మితో, సహనంతో, సమయస్ఫూర్తితో, సందర్భోచితమైన, సముచితమైన నిర్ణయాలను గైకొంటూ, ముందుకు సాగిపోతూ సమర్ధవంతమైన, స్వచ్ఛమైన పాలనను అందించవలసిన బాధ్యత శ్రీ వాజ్‌పాయిగారి మీద ఉన్నది.

ఈ సంకీర్ణ ప్రభుత్వంలో భాగస్వాములుగా ఉన్న పార్టీలవారి ఆలోచనలు భిన్నంగా కనిపిస్తున్నాయి. ఎవరి ఆలోచనలు వారివే. ఎవరి స్వార్ధం వారిదే. ఎవరి స్వప్రయోజనం వారిదే. విభిన్న సిద్ధాంతాలు, విభిన్న మనస్తత్వాలు గల నాయకులు అధికారం కోసం ఒకచోట చేరారు. ప్రభుత్వ నిర్ణయాలు ఎవరి స్వప్రయోజనానికి ఎప్పుడు అడ్డు తగిలితే అప్పుడే విడాకులు. సమిష్టి ప్రయోజనాన్ని గురించిగాని, దేశశ్రేయస్సును గురించిగాని ఆలోచించేవారు ఈనాడు మృగ్యమైపోయినారు. సమిష్టి ప్రయోజనం అంటే వారి దృష్టిలో అధికారం మాత్రమే. ఇది ఈనాటి బి.జె.పి. సంకీర్ణ ప్రభుత్వ భాగస్వాముల విచిత్ర పరిస్థితి.

ఇకపోతే అయిన దానికి, కాని దానికి ప్రభుత్వాన్ని వ్యతిరేకించటమే ప్రతిపక్షాల లక్ష్యంగా కనిపిస్తున్నది. లోక్‌సభను సాఫీగా నడపటానికి వీలులేకుండా ఏదో ఒక గందరగోళాన్ని నిత్యం సృష్టించటమే వారి ధ్యేయంగా కనిపిస్తుంది. అత్యంత ఆదర్శమును ప్రజలకు అందించవలసిన లోక్‌సభ సభ్యులు నేడు సభలో అత్యంత క్రమశిక్షణారాహిత్యమును ప్రదర్శిస్తుండటం కడుశోచనీయం. ఇది ఈనాటి భారతదేశ దుస్థితి.

అయితే ఒక శుభసూచకం కూడా ఉన్నది. అది ఏమిటంటే గతంలో ఏ ప్రభుత్వాలు గైకొనని నిర్ణయాలు ఈ సంకీర్ణ ప్రభుత్వం తీసుకుంటున్నది. 1. ప్రధానితో సహా ఎవరిపైనైనా వచ్చే అవినీతి ఆరోపణలను విచారించేందుకు వీలుగా 'లోక్‌పాల్'కు తగిన అధికారాలిస్తూ చట్టం తీసుకొనిరావటం. 2. మంత్రులందరూ వెంటనే తమ ఆస్తులను ప్రకటించటం. 3. రాజ్యాంగ సమీక్షకు కమీషన్‌ను నియమించుట. 4. సమగ్రమైన ఎన్నికల సంస్కరణలు తీసుకొని రావటం మొదలైనవి, మరియు తమ ప్రభుత్వం మచ్చలేని పాలనను అందించడానికి కట్టుబడి ఉందని శ్రీ వాజ్‌పాయిగారు ప్రకటించటం హర్షనీయం.

వ్యక్తిగతంగా శ్రీ వాజ్‌పాయి గొప్పవాడే, నిస్వార్ధపరుడే, మహామేధావే, సచ్ఛీల సంపన్నుడే, పరిపాలనాదక్షుడే. ఉండవలసిన సద్గుణాలన్నీ ఆయనలో ఉన్నవి. ఒక్క మాటలో చెప్పాలంటే ఆయనది Spotless Character (మచ్చలేని వ్యక్తిత్వం.) అయితే ఈనాటి వ్యవస్థ మాత్రం తద్విరుద్ధంగా ఉన్నది. అవినీతి వికటాట్టహాసం చేస్తున్న ఈ దుర్దినాలలో, స్వార్ధం, సంకుచిత తత్వం, బంధుపక్షపాతం, ఆశ్రితపక్షపాతం విలయతాండవం చేస్తున్న ఈ రోజులలో, కులం పేరుతో కుస్తీలు పడుతున్న ఈ తరుణంలో, మతంపేరుతో మారణహోమాలు చెలరేగుతున్న ఈ సమయంలో, ప్రాంతీయ దురభిమానం పెచ్చుపెరిగిపోతున్న ఈ కాలంలో, రాజకీయరంగం కుళ్ళి కంపుకొడుతున్న ఈ పరిస్థితులలో శ్రీ వాజ్‌పాయిగారిలో మూర్తీభవించిన సద్గుణాలన్నీ వారికి "మైనస్‌పాయింట్లే" అవుతాయి.

దేశహితం కోరి సమిష్టిప్రయోజనాన్ని ఆశించి, అందరిని కూడగట్టుకొని, సమర్ధవంతమైన, స్వచ్ఛమైన, ఏకాభిప్రాయ తరహా పాలనను అందించి భారతదేశమును ప్రపంచంలోనే ఒక అగ్రగామి దేశంగా రూపొందించాలనే పరమావధితో, చిన్ననాటి నుంచి తాను నమ్మి, ప్రచారం చేసిన, మౌళికమైన సిద్ధాంతాలను కొన్నింటిని సహితం ప్రక్కనపెట్టి, ఆత్మవిశ్వాసంతో ముందుకు సాగిపోతున్న శ్రీ వాజ్‌పాయిగారు ప్రస్తుత రాజకీయ రంగంలో, విజయాన్ని సాధించి, రాజకీయదక్షుడుగా పేరు ప్రఖ్యాతులను తెచ్చుకుంటాడో! లేక ఈ కలుషిత రాజకీయాలకు విసిగి, వేసారి, ఆత్మవంచన చేసుకొనలేక, తన పదవికి రాజీనామాచేసి ఒక మహాకవిగా, తనకలానికి పని కలిపించి, చరిత్రలో చిరస్మరణీయుడవుతాడో! కాలమే నిర్ణయించాలి.

**శ్రీ కొమరగిరి కృష్ణమోహనరావు**

ఏప్రియల్ 1998
సంపుటి 14 సంచిక 4

మేనేజర్
**కొమరగిరి చంద్రశేఖర్**
24-52, రామానాయుడుపేట,
మచిలీపట్నం - 521 001.
© 22818, 21137

Cheques & Drafts should be drawn in favour of *"SREEVANI"* Monthly Machilipatnam

Edited, Printed and Published by ***Komaragiri Krishna Mohan Rao***

| | | |
|---|---|---|
| సాధారణ సంచిక | : | 5-00 |
| సంవత్సర చందా | : | 60-00 |
| 4సం॥ల చందా | : | 225-00 |
| జీవిత సభ్యత్వం | : | 600-00 |
| పోషకులు | : | 1,116-00 |
| రాజపోషకులు | : | 5,116-00 |
| మహారాజపోషకులు | : | 10,116-00 |
| ఓవర్‌సీస్ చందా (4 సం॥లకు) | : | 50 $ |

Printed at ***SREEVANI OFFSET PRINTERS*** Machilipatnam

Despatched on
**7- 4 -1998**

# శ్రీవాణి
## సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకులు : కొమరగిరి కృష్ణమోహనరావు

## విషయసూచిక


| | | |
|---|---|---|
| అమృతవాణి | కూచిభట్ల చంద్రశేఖర శర్మ | 2 |
| బళ్ళారి రాఘవ నటజీవితం | జానమద్ది హనుమచ్ఛాస్త్రి | 3 |
| నవదుర్గలు - 5 | పురాణపండ రాధాకృష్ణమూర్తి | 6 |
| శివనామంతో శివరాత్రిని సద్వినియోగం చేయండి | భగవాన్ సాయి దివ్యబోధ | 7 |
| పదాలపందిరి - 11 | కిరీటి | 14 |
| ఎందరో మహానుభావులు - 16 | భండారు పర్వతాలరావు | 15 |
| మనిషి - మనస్సు - 21 | పాతూరి ప్రసన్నం | 16 |
| యువత - దేశభక్తి | అబ్బరాజు వెంకట హనుమత్ప్రసాద్ | 21 |
| వ్యక్తులు - వ్యక్తిత్వాలు - 90 | కంచి వాసుదేవరావు | 23 |
| సైన్స్ వాణి - 24 | కె. ఆర్. కె. మోహన్ | 25 |
| భ్రూణ హత్య | గుడిసేవ నరసింహారావు | 26 |
| గోదావరిలో సాహసి | ఎన్.వి.ఆర్. సత్యనారాయణమూర్తి | 27 |
| భగవాన్ సాయి మహిమలు | డి. వెంకటేశ్వరరావు | 28 |
| మనోభిరామం - 27 | సోమంచి రామం | 30 |
| వీరాధివీరుడు | చింతపల్లి అన్నపూర్ణ | 32 |


శ్రీవాణి ప్రకటనదారులకు, చందాదారులకు, పాఠకులకు బహుధాన్యనామ సంవత్సర ఉగాది శుభాకాంక్షలు.

సం॥

ముఖచిత్రం : బళ్ళారి రాఘవ

# అమృతవాణి

శ్లో ॥ ధార్మికత్వ ధనికత్వయుగ్మకం
త్వేకపాత్రఘటితం భవేద్యది
తత్పరాత్మఫలదం మహాద్భుతం
చైకకోశగత ఖడ్గయుగ్మవత్

- శ్రీ గణపతి సచ్చిదానంద

ధర్మగుణమూ, ధనమూ, రెండూ ఒక వ్యక్తిలో కూడి ఉన్నట్లయితే, అది ఆశ్చర్యం కలిగించే విషయమే. అప్పుడది ఇతరులకు, తనకూ కూడా లాభదాయకం. ఈ రెండు గుణాలు ఒకచోట ఉండటం ఒకే ఒరలో రెండు కత్తులిమిడినట్లే.

ధనవంతుల్లో సామాన్యంగా లోభం ఉంటుంది. "ధనమూలమిదం జగత్" అని బాగా నమ్మి కణంకూడా పోనీకుండా సంపాదిస్తుంటారు. "డబ్బులేనివాడు డుబ్బుకుకొరగాడు" అంటారు. "ధనం మదాయ" ధనం మదంకలిగిస్తుందంటారు. "నిర్ధన పురుషశ్శష్పసమానః" ధనం లేని వాడు గడ్డిపరకతో సమానమట. ఇలాటివన్నీ తెలుసు కనుక ఏదో విధంగా డబ్బు సంపాదించి ధనవంతులు కావటానికి ప్రయత్నిస్తారు సామాన్యంగా. అలాంటి వారికి ఉదారగుణాలు ఉండవు. బొక్కసం నింపటమే గాని బయటకు తీయటానికిష్టపడరు. దానం చేయటమంటే ఇతరులకియ్యాలి కదా ఇస్తే ధనం తగ్గిపోతుందే. ఇలాంటి భావాలుండటం చేత దానాదులు చేయరు. కూడపెడతారు. ధనవంతుల్లోనే మరోరకంవాళ్ళు సరదాలకు సంబరాలకు ఖర్చు పెట్టుకుంటారు. దాన ధర్మాలకు పెట్టరు. ధనమనేది తామనుభవించాలి లేకపోతే ఇతరులకివ్వాలి ఈ రెండే గుణాలు. మూడోది ఎవరికి కాకుండా దొంగలెత్తుకొనిపోవటమో, ఎవరూ ఉపయోగించ కుండా పోవటమో జరిగితే తాను తిన్నట్లా ఇతరులకు పెట్టినట్లా చెప్పండి. ధనం వస్తే కళ్ళునెత్తికెక్కుతాయట అంటే మదగర్వమేర్పడుతుంది. పెద్దలను కూడా లెక్కచేయని పొగరు వస్తుందట.

ఇలాంటి ధనానికి రక్షణ దానమే. దానధర్మాలు చేయటంవల్ల బీదాబిక్కికి లాభం కలగటంతోపాటు దాతకు పుణ్యం వస్తుంది. పుణ్యం ధనం కంటె విలువైంది. మళ్ళాకొన్ని రెట్లిస్తుంది. ధనం దానం చేయటంవల్ల ఇతరులు సంతోషించి మనసారా శ్రేయస్సు కలగాలని కోరుకుంటారు. అప్పుడు ధనవంతుల కుటుంబం సుఖశాంతులతో ఉంటుంది. పదిమందికి దానధర్మాలు

## కూచిభట్ల చంద్రశేఖర శర్మ

చేయాలని కోరిక ఉంటుంది కొందరికి. వాళ్ళ దగ్గర ధనం ఉండదు. "ఉత్పద్యంతే విలీయంతే దరిద్రాణాం మనోరథాః" అని దరిద్రులకు కోరికలు సముద్రంలో తరంగాల్లాగా వూరికే పుడుతుంటాయి. అంతట్లోనే లయం చెందుతాయి. ప్రయోజనమేముంది అలాంటివారికి ధనం ఉండదు. ఇవి రెండూ ఒక చోట ఉంటే ఆశ్చర్యం కాక మరేమిటి చెప్పండి. నిజం చెప్పాలంటే ఈ రెండు ఒక ఒరలో కత్తులవంటివి అయినా పరస్పర పోషకాలు.

ధనం ఉంది కనుక దానాదులు చేయగలుగుతున్నాడు. దానాలు చేస్తున్నాడు. కనుక ప్రజల్లో ఆ దాత మీద గౌరవాదరాలు కలుగుతాయి. పదిమందికి పెట్టేవాడి ధనం మీద దొంగలు కూడా ఆశపడరు.

ధనముంటే మంచీ చేయవచ్చు, చెడూ చేయవచ్చు. అలా చేస్తే పుణ్యం పురుషార్థం కూడాను. అసలు జుట్టుంటూ ఉంటే ఎలాంటి జడలైనా వేసుకోవచ్చు. బోడి గుండుకేం వేస్తావు. కనుక ధార్మిక గుణం ఉన్న చోట ధనం కూడా ఉందంటే లోకోపకారకం. తనకు ఇహపర లాభదాయకం. ధనం వల్ల వచ్చే గర్వం, మదం మొదలైన చెడు, దానాదుల వల్ల పోతుంది. అయితే న్యాయంగా ధనమార్జిస్తే తృప్తి ఉంటుంది, పవిత్రత ఉంటుంది. దానం చేయని ధనం "చీమలు పెట్టిన పుట్టలు పాములకిరవైనయట్లు" అవుతుంది. "అన్యాయార్జితం విత్తం సహమూలం వినశ్యతి" అన్యాయంగా సంపాదించిన ధనం మొదలంటా నశిస్తుందట.

# బళ్ళారి రాఘవ నటజీవితం

జాతి సర్వతోముఖ వికాసానికి నాటకం ప్రధాన సాధనం కావాలని విశ్వసించిన మహానటుడు బళ్ళారి రాఘవ. పాశ్చాత్య నాటకరంగంలోని నూతన విధానాలన్నిటినీ తెలుగు నాటక రంగంలో ప్రవేశపెట్టినవాడు రాఘవ.

సుదీర్ఘ రాగాలాపనలతో అలమటిస్తూన్న తెలుగు నాటకరంగాన్ని సహజత్వానికి చేరువగా తీసుకువెళ్ళిన విప్లవనటుడు రాఘవ. నాటక రంగ చరిత్రలో కొత్త అధ్యాయాన్ని ప్రారంభించిన నటయోగి బళ్ళారి రాఘవ.

1944-46మధ్య బళ్ళారిలో రాఘవగారిని పలుమార్లు కలుసుకొన్న అదృష్టం నాకు లభించింది. 1945లో రాఘవ చివరిసారిగ ప్రదర్శించిన పాదుకా పట్టాభిషేకం నాటకంలో చిన్నపాత్రకూడా ధరించాడు. రాఘవ సంగీత విశారదుడు కాడు. శ్రావ్యమైన కంఠస్వర మాయనది. పద్యాలను వచనం వలె పలికినా, ఆ పలుకు తీరు భావపూర్ణంగా ఉండేది. ఒకమారు విశ్వకవి రవీంద్ర నాధటాగూర్‌తో మాట్లాడుతూ, తనకు సంగీతం రాదన్నాడు రాఘవ. "మీరు పాడకుంటే ఏం? మీ ప్రతి పలుకులోను సంగీతం ఉంది" అన్నాడు టాగూర్.

రాఘవ కళామయ జీవితంలోని కొన్ని రసవద్ఘట్టాలు వినండి.

ఆయన సమయస్ఫూర్తి అద్భుతం. ఒకమారు విజయవాడ దుర్గాకళామందిరంలో "చంద్రగుప్త" నాటకం ప్రదర్శింపబడింది. స్థానం నరసింహారావుగారు ముర పాత్రధారి. విజయవాడ ప్రేక్షకులకు అదో నేత్రపర్వం.

సోదరప్రేమ పూరితుడైన చంద్రగుప్తుడు నందులతో పోరు సల్పనన్నాడు. నందవంశ నిర్మూలనంతో కాని తన దుఃఖం తీరదంటుంది తల్లి ముర. నందులు చేసిన అవమానాలకు ప్రతీకారం జరగవలసిందేనని, చంద్రగుప్తుని సమరానికి ప్రేరేపిస్తాడు చాణక్యుడు.

చంద్రగుప్తుడు యుద్ధభూమికి బయలుదేరే ముందు, చాణక్యులు ఆశీస్సులర్థిస్తూ నమస్కరిస్తాడు. చాణక్యుల తన జోలెలోని కుంకుమ బరిణె కోసం చేయి పెట్టాడు. జోలెలో బరిణె లేదు. వెంటనే తన నొసటి కుంకుమనే తీసి చంద్రగుప్తుని నొసటిపై తీర్చి 'విజయోస్తు' అంటాడు. ఆ సన్నివేశాన్ని తిలకించిన ప్రేక్షకుల కరతాళ ధ్వనులతో కళామందిరం మార్మోగింది. నాటకం పూర్తి

## జానమద్ది హనుమచ్ఛాస్త్రి

అయిన తర్వాత వారి శిష్యుడు జోళదరాస దొడ్డనగౌడ మాట్లాడుతూ, 'అయ్యా బరిణె జోలెలో లేనపుడు నొసటి కుంకుమ తీసి పెట్టాలన్న స్ఫురణ ఎలా కలిగింది' అని ప్రశ్నించాడు. అంతా శివానుగ్రహం అన్నాడు రాఘవ.

ఆ కుంకుమ బరిణెను ముందుగానే జోలెలో నుంచి తీసి, రాఘవను పరీక్షించాలని సంకల్పించిన స్థానం నరసింహారావుగారు, భాస్కరాచార్య రామచంద్రస్వామి గారు, రాఘవ సమయస్ఫూర్తికి ఆశ్చర్య చకితులయ్యారు.

మరోమారు చంద్రగుప్త నాటకం ప్రదర్శన జరుగుతూ ఉంది. నందుల సభలో జరిగిన పరాభవానికి ఉగ్రుడై, ప్రతీకారం తీర్చుకోవాల్సిందేనంటూ, ప్రళయ కాలరుద్రునివలె నటిస్తున్నాడు చాణక్య పాత్రధారి రాఘవ. ఆ సమయంలో ఆకస్మికంగా ఒక కుక్క రంగస్థలంపై ప్రవేశించింది. అనూహ్యమైన ఈ సంఘటనను చూచి ప్రేక్షకులు రసాభాస అవుతుందనుకొన్నారు. శునక రాజమా! నీకు కూడా నేను లోకువయ్యానా? అంటూ కుక్కను సంబోధిస్తూ మాట్లాడే నరికి ప్రేక్షకులు సంభ్రమాశ్చర్యాలతో మునిగిపోయారు.

ఒకమారు సతీసావిత్రి నాటక ప్రదర్శన, గుడివాడలో అనుకొంటాను యమపాత్రధారిగ గురజ నాయుడు అద్భుతంగా నటించేవాడు. కాని ఆనాటి నాటకంలో రాఘవ యమధర్మరాజుగా నటిస్తారని ప్రకటించారు. స్థానం నరసింహారావుగారు ప్రేక్షకులలో కూర్చున్నారు.

యమధర్మరాజు వేషంలో రాఘవ రంగప్రవేశం చేశారు. ఈ యమునికి కోరమీసాలు లేవు. భీకారాకారం లేదు. భుజకీర్తులు, కిరీటం, గద, పాశం లేవు. పక్కన దున్నపోతు లేదు. విభూతి ధరించి, బిళ్ళగోచితో ధోవతి ధరించి, ఉత్తరీయంతో, రుద్రాక్షమాలతో యమధర్మరాజు రంగప్రవేశం చేసాడు. శుద్ధ శ్రోత్రియ బ్రాహ్మణుడుగా ఉన్నాడు.

యముడు సావిత్రి వద్దకు వెళ్ళి సాంత్వన వచనములతో ఆమెను సంబోధించాడు. ఈ వేషం మార్పు, సంబోధనా, ప్రేక్షకులకు ఆశ్చర్యం కల్గించింది. సావిత్రి వేషం ధరించిన ఉప్పులూరి సంజీవరావు నివ్వెరపోయాడు. తెప్పరిల్లుకొని తన పోర్షన్ ప్రారంభించాడు. 'అహో, కాలమేఘ సదృశ శరీరుడగు ఈ భీకరాకారం బెవ్వరిది? ఈ కరాళదంష్ట్రావృత భయంకరాననుడెవ్వరు?' అంటూ సుదీర్ఘ సమాసాలతో నిండిన తన పోర్షన్ మొదలుపెట్టాడు. ఈ మాటలు వద్దని ముందుగానే రాఘవ, ఆ నటునికి చెప్పారు. కాని అలవాటు మానలేకపోయాడు. రంగస్థలంపై చేసిన సంజ్ఞలను గమనించ లేదు. తన మాటలన్నీ అప్పచెప్పాడు సావిత్రి పాత్రధారి. అంతా అయ్యేవరకు, రాఘవ యమధర్మరాజుగ ప్రశాంతవదనుడై ఉన్నాడు. చివరన "తల్లీ, సావిత్రి సాధ్వీ! నీ పతి ప్రాణాలను గొంపోవ వచ్చిన యముడను నేను. నీవు మహాపతివ్రతవు. నా భటులు భయకంపితులై నీ వద్దకు రాక మరలివచ్చారు. నా విధి నిర్వహణకు నేను రాక తప్పలేదు. నీవు పతి వియోగ దుఃఖోన్మాదనంలో నన్నెట్లు శపింతువోనని శంకించి సాధు రూపమున నీ సమక్షమున కరుగుదెంచితిని. తల్లీ! దోషులను శిక్షించు సమయమందు నేను భయంకరాకారుడుగ ఉందును. కానీ నీ వంటి సాధ్వీమ తల్లులను సందర్శించునపుడు సాధువుగానే వత్తును. అజ్ఞానులూహించి ఆడుకొను మాటలను నమ్మి నన్ను భయంకరునిగా భావించకు" అంటూ తన రూపమును, కర్తవ్యమును విశదపరచాడు. ఈ మార్పు అత్యంత సమయోచితమని గ్రహించిన ప్రేక్షకులు ఉప్పొంగి పోయారు. ఈ విధంగా నాటక సన్నివేశాన్ని తీసుకుని పాత్రకు నూతన వ్యాఖ్య చేసేవాడు రాఘవ.

మహానటులు తాము ప్రదర్శించే నాటకాలలో కొన్ని సన్నివేశాలను స్వయంగా చొప్పిస్తారు.

ఒక మారు 'రామదాసు' నాటక ప్రదర్శన ప్రారంభం కావాల్సి ఉంది. థియేటర్‌లో రాఘవ కొందరు పెద్దలతో పాటు ప్రేక్షకుల ముందు వరుసలో కూర్చున్నారు. మిత్రులతో మాట్లాడుతూ ఉన్నారు. అంతలోనే రంగస్థలంపై భజన సంఘం ప్రవేశించింది. భజన జరుగుతూ ఉంది. ధోవతి జుబ్బాతో ఉన్న రాఘవ తటాలున సోపానుండి లేచి రంగప్రవేశం చేశాడు. భజన బృందంలో చేరి

"అయ్యా, మీరెక్కడికి వెళ్తున్నారు?"

"భద్రాద్రికి."

"నేను వస్తాను. తీసుకువెళతారా?"

"ఇలా కట్టుబట్టలతోనా? మీవారికి చెప్పకుండానే రావటమా!"

'అవును."

అంటూ "భద్రాది రఘురామ భజనకు జనుచుండ బంధుమిత్రుల యాజ్ఞబడయనేల...... అంటూ తనదైన శైలిలో సీసపద్యం పాడుకొంటూ, నేపధ్యంలోకి వెళ్ళారు. రసహృదయులను ఆ సన్నివేశం ఎంతగానో అలరించింది.

రాఘవ జాతీయోద్యమం పట్ల ఎంతో అభిమానం కలవాడు. సమయోచితంగా నాటకాల్లో తన భావాలకు రూపకల్పన చేసేవాడు. రామదాసు ప్రభుత్వ నిధులతో శ్రీరామాలయం నిర్మించాడు. ద్రవ్యాపహరణం చేశాడన్న అభియోగంపై తానీషా, రామదాసును బంధించి తీసుకుని రావలసిందిగా భటులను పంపాడు.

భటులు వచ్చారు. రామదాసును తీసుకొని వెళ్ళనున్నారు. రామదాసు భార్య కమలాంబ భర్తకు ఖద్దరు ఉత్తరీయం కప్పింది. పూలదండ వేసింది. గాంధీటోపి అందివ్వగా, రామదాసు దానిని తలపై ధరించాడు. భర్తనొసట కుంకుమ తిలకం దిద్ది వీడ్కోలు పలికింది కమలాంబ.

స్వాతంత్ర్య సమరంలో, దేశభక్తులను జైలుకు తీసుకువెళ్తున్నకాలమది. ఆ దృశ్యం ప్రేక్షకులనెంతో ఉత్తేజపరచేది.

బళ్ళారిలో ఆంధ్ర వారోత్సవాలు వైభవోపేతంగా జరిగాయి. ఆంధ్రనాటక పితామహ ధర్మవరం రామకృష్ణ మాచార్యుల సంస్మరణ సభలో పెద్దలు ఉపన్యసించారు. వేదికపై శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు, విశ్వనాధ సత్యనారాయణ ఆసీనులైనారు.

సభానంతరం రాఘవ హిరణ్యకశిపుడుగా, ప్రహ్లాదనాటకంలోని ఒక సన్నివేశాన్ని ప్రదర్శించారు. రాఘవగారి అభిమాన పుత్రుడు మాస్టర్ శ్రీనివాస కుమార్ ప్రహ్లాద పాత్ర ధరించాడు. హిరణ్యకశిపుడు, ప్రహ్లాదుని హెచ్చరిస్తూ ఇకనైనా హరినామస్మరణ మానుకోమంటాడు. తండ్రి మాటనుకాదని, ప్రహ్లాదుడు భాగవతంలోని "కంజాక్షునకు గాని కాయంబు కాయమే....." అన్న పద్యాన్ని ప్రారంభించి, చివరిపాదం 'విష్ణుచింతలేని విబుధుండు విబుధుడే పాద యుగము తోడి పశువుగాక' అన్న పాదాన్ని వల్లించక వూరకుండిపోయాడు. రాఘవ హెచ్చరించాడు. ప్రహ్లాదుని ఉరిమి చూశాడు. కాని లాభం లేకపోయింది. చివరి పాదం మరిచాడు శ్రీనివాస్.

పండితులు, ప్రేక్షకులు, ప్రహ్లాద పాత్రకు శ్రీనివాస్ అసమర్థుడన్నారు. రాఘవ కూడా అసంతృప్తి చెందినట్లు కనిపించాడు. రాఘవ వేషం మార్చుకుని వేదిక మీదకు వచ్చాడు. సభాధ్యక్షులైన విశ్వనాధ సత్యనారాయణ గారు మాట్లాడుతూ, "ఆచార్యులవారు, ప్రహ్లాద పాత్ర ధారణకు యోగ్యుడైనవాడెవడూ దొరకలేదా? ఈ మతి మరుపువాడే దొరికాడా?" అని ప్రశ్నించారు.

"వీడు మా పిల్లవాడే! ఎన్నో ప్రదర్శనలలో పాల్గొన్నాడు. ఈ రోజు గ్రహచారం బాగాలేక, ఈ పొరపాటు జరిగింది. అంటూ, లేచి, ప్రేక్షక మహాశయులారా! మీరందరూ మతిలేనివారైనారు. వేదిక మీదవున్న మహాకవులు కూడా మతిలేనివారైనారు. సుమారు అరగంటసేపు సంభాషణలు, పద్యాలు అనర్గళంగా చెప్పి మిమ్ములను ముగ్ధుల్ని గావించాడు మా శ్రీనివాస్. పోతనగారి పద్యంలోని చివరిపాదం మరిచిపోవటమా? తండ్రిని ఏ కుమారుడైనా ఏ పరిస్థితులలోనైనా 'ద్విపాద పశువు' అంటాడా?

అందులోను మహాతపస్సంపన్నుడూ, అనన్య సామాన్యుడూ అయిన తండ్రిని ప్రహ్లాదుడు, 'ద్విపాద పశువు' అనగలడా? అందుకే మావాడు, బాగా ఆలోచించి 'పాదయుగముతోడి పశువుగాక' అనటం సముచితం కాదని, ఆ పద్యపాదాన్ని చెప్పలేదు. అంతేకాని, పద్యం పూర్తిగా చెప్పలేకకాదు. అనగానే వేదిక పైనున్న పెద్దలు, సభలోని ప్రేక్షకులు భేష్, భేష్ అంటూ హర్షధ్వానాలు చేశారు.

రాఘవ నటజీవితంలో ఇటువంటి రసవద్ఘట్టాలు కోకొల్లలు. 1927లో గాంధీజీ బెంగుళూరు సమీపంలోని నందిహిల్స్‌లో విశ్రాంతి కోసం కొన్ని రోజులున్నారు. పండిత వీరానాధ్‌గారు రచించిన 'దీనబంధు కబీర్' హిందీ నాటకాన్ని చూడడానికి గాంధీజీతోపాటు రాజాజీ బెంగుళూరుకు వచ్చారు. 20 నిమిషాలు మాత్రం నాటకం చూడాలని సంకల్పించిన బాపూజీ, నాటకం పూర్తి అయ్యేవరకు తన్మయులై చూస్తూనే వున్నారు. మధ్యలో రాజాజీ, అయ్యా, ప్రార్థన వేళ అయింది. వెళ్దాం, అని హెచ్చరించాడు. "ఇది ప్రార్థన కాదా" అంటూ నాటకం పూర్తిగా చూచి, ప్రదర్శనానంతరం రాఘవగారిని కలుసుకొని, మీ నటన అద్భుతం అంటూ 'రాఘవ మహరాజ్ కీ జై' అన్నారు.

జాతిపిత ప్రశంసలందుకొన్న మహానటుడు రాఘవ. ఆయన నటయోగి. రంగస్థలాన్ని దేవాలయంగా, నటన తపస్సుగా విశ్వసించిన మహానుభావుడు రాఘవ. రాఘవగారికి నివాళులర్పిస్తూ సరస్వతీ పుత్ర, శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యులుగారు,

**"ఆ విశాలలోచనాలు, అనంత భావాల దర్పణాలు**
**ఆ నాసిక అతిలోక సౌందర్యానికను ప్రవేశిక**
**అతనివంటి నటకుడు నాడు లేడు, ఇక రాడు**
**ఆ జ్యోతికి సర్వ ప్రపంచం నివాళులిచ్చింది**
**ఆ మరణానికి కాలం నిట్టూర్చింది**
**మనిషిగా జన్మించిన గంధర్వుడు రాఘవ**
**ఆయన దివ్య స్మృతికి నా నమస్సులు"**



నవదుర్గలు - 5

# స్కంద మాత

*సింహాసనగతా నిత్యం పద్మాశ్రిత కరద్వయా*
*శుభదాస్తు సదా దేవీ స్కందమాతా యశస్వినీ*

దుర్గా మాతయొక్క పంచమ స్వరూపము స్కందమాతృ నామంతో ప్రఖ్యాతి చెందింది. ఈ స్కంద భగవానుడు కుమార కార్తికేయ నామంతో కూడ వ్యవహరింపబడతాడు. ప్రసిద్ధ దేవాసుర సంగ్రామంలో ఈతడు దేవసేనాపతిగా నిలచాడు కూడ. పురాణాలలో ఈతడు కుమారుడనీ, శక్తిధరుడనీ పిలవబడ్డాడు. ఈతని మహిమలు వాటిలో కీర్తించబడ్డాయి. ఈతడు మయూర వాహనుడని కూడా పిలువబడ్డాడు.

ఈ స్కందదేవుని జనని కావడం వల్లనే దుర్గామాత యొక్క ఈ పంచమ స్వరూపం స్కంద మాతృనామంతో ఖ్యాతిగాంచినది. ఈమె ఉపాసన నవరాత్రులలో పంచమ దివసాన కొనసాగుతుంది. నాడు సాధకుని మనస్సు 'విశుద్ధ' చక్రంలో లయమై ఉంటుంది. స్కందదేవుడు బాల రూపంలో ఈ తల్లి ఒడిలో ఆసీనుడై ఉంటాడు. స్కందమాతృ స్వరూపిణికి చతుర్భుజాలు, ఈమె దక్షిణంగా ఉన్న పైకి లేచిన చేతితో స్కందబాలుని ఒడిలో కూర్చోబెట్టుకుని ఎత్తుకుని ఉంది. అదే వైపున ఉన్న క్రింద చేయి వరముద్రలో ఉన్నది. పై రెండు చేతులలో పద్మాలు ఉన్నాయి. సంపూర్ణంగా శుభ్ర వర్ణంలో రాజిల్లే ఈ తల్లి కమలాసనంపై విరాజిల్లుతూ ఉంటుంది. అందులకే ఈమెను పద్మాసనాదేవి అని కూడా పిలుస్తారు.

నవరాత్రి దీక్షలోని పంచమ దివసానికి విశేష మహత్త్యమున్నట్లు, శాస్త్రాలు వర్ణించాయి. పంచమ దివసాన సాధకుని మనస్సు విశుద్ధ చక్రంలో లయమై ఉంటుంది. ఈ చక్రంలో స్థిరమనస్కుడైన సాథకుని బాహ్యక్రియలూ, చిత్త వృత్తులు లోపించి ఉంటాయి. అతని మనస్సు విశుద్ధ చైతన్యం వైపు పురోగమిస్తూంటుంది. అతని మనస్సు సమస్త లౌకిక సాంసారిక, మాయిక, బంధనమునకై స్కంద మాతృస్వరూపంలో పరిపూర్ణంగా లీనమై పోతుంది. తత్సమయంలో సాధకుడు అత్యంత సావధానంగా ఉపాసనవైపు పురోగమించాలి.

స్కంద మాతృపాసన వల్ల సాధకుని కోరికలన్నీ నెరవేరుతాయి. ఈ లోకంలోనే అతనికి పరమశాంతితో పాటు సుఖానుభవం కలుగుతుంది. మోక్ష ద్వారాలు అతనికి సులభంగా తెరచుకుని ఉంటాయి. స్కందమాతా దేవి ఉపాసనతో బాటు బాల స్కంద భగవదుపాసన కూడ తనంతతానై జరుగుతుంది. ఈ అవకాశం వీరికి మాత్రమే ఉంది. కనుక సాధకుడు స్కంద మాతాదేవి

**పురాణపండ రాధాకృష్ణమూర్తి**

ఉపాసన యందు జాగరూకుడై ఉండాలి. సూర్య మండలాధిష్ఠాత్రీ దేవి కావడం వల్ల ఈ దేవి ఉపాసకులు దివ్య తేజోవిరాజితులై ఉంటారు. ఓ అలౌకిక ప్రభామండలం అదృశ్య భావంతో సర్వదా అట్టి సాధకుని పరివేష్టించి ఉంటుంది. ఈ ప్రభామండలం ప్రతి క్షణం అతని యోగక్షేమాలను నిర్వహిస్తూ ఉంటుంది.

కనుక మనం ఏకాగ్ర భావంతో మనస్సును పవిత్రంగా ఉంచుకుంటూ, మాతృచరణాలను శరణు వేడాలి. ఈ ఘోర భవసాగర దుఃఖం నుండి విముక్తి పొందడానికి ఇంతకు మించిన సులభ, ఉత్తమోపాయంవేరే ఏమీ లేదు.

॥ స్కంద మాతకూ జై ॥


**శ్రీవాణి జీవిత సభ్యులు**



శ్రీ చుండూరి శ్రీరామమూర్తి, శ్రీమతి విమలాదేవి
శ్రీ వెంకటేశ్వరా కామ్యూస్ ఇండస్ట్రీస్,
పలాస, శ్రీకాకుళం జిల్లా

శివరాత్రి సందేశం

# శివనామంతో శివరాత్రిని సద్వినియోగం చేయండి!

"హరిమయము కాని ద్రవ్యము పరమాణువు లేదు ఇలన్ పరికించినచో" ఈ ప్రపంచమంతయూ హరి మయమే. ప్రతి మానవుడు ఆనందాన్ని కోరుకుంటాడు. ఆనందమయమైన జీవితమును ఆశిస్తుంటాడు. ఈ ఆనందము నిమిత్తమై అనేక విధములైన ప్రయత్నాలు చేస్తుంటాడు మానవుడు. భారతీయ సంస్కృతీ సంప్రదాయములు ఈ ఆనందమును ప్రబోధిస్తూ వచ్చాయి. ప్రతి మానవుని చుట్టూ భౌతికము, ఆధ్యాత్మికము అనే రెండు తెరలు వెన్నంటి ఉంటూనే ఉంటాయి. భౌతికము (Material out look) ఆధ్యాత్మికము (Spiritual outlook) - ఈ రెండింటి యొక్క సమత్వాన్ని, ఏకత్వాన్ని మానవుడు గుర్తించుకొనలేక ఈ రెండూ వేరు వేరని భావిస్తున్నాడు. ఈ రెండింటి యొక్క ఏకత్వమే నిజమైనటువంటి ఆత్మతత్త్వము.

భౌతికమైన, లౌకికమైన, ప్రాకృతమైన ఈ జగత్తు నందు పదార్థములే ప్రధానమని ,ప్రమాణమని విశ్వసించి, దీని నిమిత్తమై మానవుడు తన జీవితమును అంకితం గావించుకుంటున్నాడు. యోచించి చూచినచో ఇందులో ఏ మాత్రం సత్యంలేదు. అప్పటికప్పటికి మాత్రమే ఇది సత్యంగా గోచరిస్తుంది. కాని ఇది శాశ్వతమైన సత్యం కాదు, శాశ్వతమైన ఆనందం కాదు. శాశ్వతమైన ఆనందమును పొందవలెననిన దీనికి తగిన కృషిచేయాలి. జగత్తంతయూ ఈ సత్, చిత్, ఆనందమయమే. ఈ జగత్తే సచ్చిదానందం. ప్రతి ప్రాణి ఈ ఆనందం నిమిత్తమే అర్రులు చాచుకొని ఉన్నది. కేవలం మానవ మాత్రులే కాదు పశు, పక్షి, మృగాదులు కూడనూ ఈ ఆనందమును ఆశిస్తూనే ఉన్నాయి. సర్వ ప్రాణులకు ప్రధానమైన ప్రాణం ఈ ఆనందం. ఆనందంలేకుండా ఒక్క క్షణమైనా మానవుడు ఈ జగత్తులో నిలువజాలడు. వేదశాస్త్ర ఇతిహాసపురాణాలన్నియూ సత్, చిత్, ఆనందమే ప్రధానమైన లక్ష్యమని ప్రబోధిస్తూవచ్చాయి. అందువలననే ప్రతి మానవుడూ "సచ్చిదానందం...సచ్చిదానందం....." అని ఉచ్చరిస్తూ వస్తున్నాడు. అయితే ఇతనికి స్వానుభవం ఏమాత్రంలేదు. ఎంతటి పండితులైనా, విద్వాంసులైనా గ్రంధములో ప్రబోధించిన విషయాలను మాత్రమే ఉచ్చరిస్తున్నారుగాని, స్వానుభవం మాత్రంలేదు.

## భగవాన్ సాయి దివ్య బోధ

ఈనాడు ప్రతి మానవుడు 'సచ్చిదానందం' అంటే ఏమిటో గుర్తించడానికి ప్రయత్నించాలి. ఈ సచ్చిదానందం అనేది ప్రత్యేకంగా ఉన్నదని విశ్వసిస్తున్నాడు. దేహాభిమానం ఉండినంతవరకు ఈ సత్, చిత్, ఆనంద మనేటటువంటివి తనకంటే వేరైనటు వంటిదని భావిస్తుంటాడు. "నేను" అంటే ఎవరు? అనేటటువంటి సత్యాన్ని గుర్తించాలి? "నేను ఎవరు?" అనే సత్యమును గుర్తించిన తరువాత ఈ సత్, చిత్, ఆనందం అనేటటువంటి దానికోసం ప్రత్యేకంగా తాను కృషి చేయనవసరంలేదు. నేను దేహమును, నేను మానవుడిని, నేను జీవుడను అనేటటువంటి భావము ఉండినంత వరకునూ ఈ సత్, చిత్, ఆనంద నిమిత్తమై అనేక విధములైన ప్రయత్నములు చేస్తుంటాడు మానవుడు. ఈ 'నేను' అనేటటువంటి తత్త్వాన్ని గుర్తించుకొనిన మానవుడు ఇంకా సత్యం వేరొకటి ఉన్నదని విశ్వసించడు. తానే సత్, చిత్, ఆనందస్వరూపుడని భావిస్తాడు. అసలు ప్రతి వ్యక్తీ సత్, చిత్, ఆనంద స్వరూపుడే.

'సత్' దేవుడు 'చిత్' జీవుడు. ఈ రెండింటి యొక్క ఏకత్వమే 'ఆనందము'. 'నేను' ఎవరు? అనేటటువంటి సత్యమును తాను విచారించుకున్నప్పుడు ఈ సత్, చిత్‌తో కూడినటువంటి ఆనంద స్వరూపుడనేనని తెల్సుకుంటాడు. కనుక దేహాభిమానం ఉండినంతవరకూ, ఎవరు ఎన్ని ప్రయత్నములు చేసినప్పటికినీ, సత్, చిత్, ఆనందం అనేటటువంటి దానిని తాను పొందలేడు. ఒక విషయం గుర్తించాలి. ఈనాటి మానవుని దేహమునకు

స్థాపితం:1964
శ్రీ
నగలు
22C.T. బంగారు
కవరింగ్
చేయబడినవి.
ఆఫీస్ ఫోన్ నెం: 2785
ఇంటి ఫోన్ నెం: 2235
శ్రీ గోల్డు కవరింగ్ వర్క్సు®
P.B.No:135 శ్రీమహల్, మచిలీపట్నం-2.

అనేక విధములైన రోగములు సంభవిస్తున్నాయి. ప్రతి మానవుడు అవి దేహమునకు వచ్చిన రోగములేనని విశ్వసిస్తున్నాడు. యదార్థంగా అన్ని రోగములు దేహమునకు సంబంధించినవి కావు. దేహమునకు సంబంధించిన రోగములను ఔషధములు ద్వారా నివారించుకోవచ్చును. కాని ఈనాడు మానసిక రోగములే అమితంగా ఉంటున్నాయి. సంకల్ప వికల్పములు మనసుకు చేరి మనసు ద్వారా ఈ శరీరములోని ప్రతి కణమును రోగమయంగా మారుస్తున్నాయి. కనుక మానవుని యొక్క రోగములకు మూలకారణము మనసే. ఈ మనసు ఈ దేహము చేత కట్టబడినటు వంటిదే. దేహము మనసునకు ఒక విధమైన ఉపాధి. ఈ ఉపాధుల యొక్క సంబంధమంతా కూడనూ నెగిటివ్. ఈ నెగిటివ్ నేచర్‌ను మనం అనుసరించినంత వరకు మనకు ఏమాత్రం ఆనందం లభ్యంకాదు. మానవుని మనసు నందు రోగములు మాత్రమేకాదు, కొన్ని రసాయనిక పదార్థములు కూడా ఆవిర్భవిస్తున్నాయి. దుష్టసంకల్పములు, సత్సంకల్పములు కూడా ఆవిర్భవిస్తుంటాయి. సంకల్పములు సక్రమమైనవి అయినప్పుడే మానవుడు చక్కని ఆరోగ్యమును పొందగలడు. అనవసరమైన ఆలోచనలు సలిపినకొద్దీ మానవుడు అన్ని రోగములకు గురిఅవుతుంటాడు. అసలు సంకల్ప వికల్పములే రోగములకు మూలకారణము. ఇవి అనేక విధములైన రోగములను మానవుని యందు పుట్టిస్తున్నాయి. అజీర్ణ వ్యాధి, మధుమేహము, గుండె జబ్బులు, రక్తపుపోటు వగయిరాలు సంభవిస్తున్నాయి. మానసిక వ్యాధులు కూడా వస్తున్నాయి. రోగములకు మూలకారణమైన సంకల్పములు మన ఆనందమునకు అడ్డుతగులుతున్నాయి.

ప్రతి మానవుడు ముక్తి కావాలని ఆశిస్తూన్నాడు. ఈ ముక్తి ఎవరికి కావాలి? దేహమునకా? మనసునకా? బుద్ధికా? లేక ఇంద్రియములకా? విచారణ చేస్తే మనసు, బుద్ధి, ఇంద్రియములకు మొట్టమొదట ముక్తి కావాలి. ఆరోగ్యము కావాలని విచారించటం కూడా ఒక రకమైన ముక్తే. రోగములు నివారణ అయినప్పుడే మనకు ఆరోగ్యము ప్రాప్తిస్తుంది. కనుక రోగముల నుంచి విముక్తి పొందటం - ఇది కూడా ఒక ముక్తియే. ఈనాడు మానవుడు అశాంతులకు మూలమై శాంతికి దూరమవుతున్నాడు. శాంతి మానవునిలో ప్రవేశించి, అశాంతిని విముక్తి గావించటం కూడా ఒక ముక్తియే. ఈనాడు చాలామంది మానవులు ఆకలిచేత బాధపడుతున్నారు. అన్నం తిని ఆకలిని నివృత్తి గావించుకోవటం కూడా ఒక ముక్తియే. నిత్య జీవితంలో దుఃఖములను, కష్టములను నివారణ గావించుకోవటం కూడా ఒక ముక్తియే. 'ముక్తి' అనేది మరణించిన తరువాత లభ్యమయ్యేది అని భావించటం పొరపాటు. ఈనాడు మనం సాధించవలసిన ముక్తులు భౌతికమైనటువంటివే. దేహాభిమానం ఉండినంతవరకూ ఈ బాధలు మనకు తప్పవు. కనుక మానవుడు ఈనాడు అనుభవించేటటు వంటి ప్రతి కర్మకూడనూ నెగిటివ్. ఈ Negative Thoughts మానవునిలో ఉండినంతవరకూ, ఏమాత్రం అతనికి శాంతి లభ్యంకాదు. మనం పొందవలసిన ముక్తి శాంతియే. శాంతి లభ్యమైతే సర్వమూ మనకు లభ్యమైనట్లే.

భగవంతుడు అనగా బ్రహ్మయే. బ్రహ్మ అనగా సత్యమే. సత్యమే దైవస్వరూపము. కనుక సత్యమనే మార్గంలో మనం ప్రయాణించినప్పుడే మనకు శాంతి లభ్యమవుతుంది. మానవునియందు ఈ Negative Thoughts ప్రవేశించటం చేతనే అశాంతికి గురి అవుతున్నాడు. హృదయంలో ఈ Negative Thoughts ఉంచుకొని ఎన్ని విధములైన ప్రార్థనలు చేసినప్పటికిని, ఎన్ని విధములైన సాధనలు సలిపినప్పటికిని, ఎన్ని జపములు, ఎన్ని పూజలు చేసినప్పటికినీ ప్రయోజనం లేదు. ఇవన్నీ వ్యర్థమే. మన అంతఃకరణయే పెద్ద Water Tank. సర్వ కర్మలు, సర్వేంద్రియములు దీనికి Water Taps వంటివి. కనుక మన అంతఃకరణయందు ఒక విధమైన Negative Thoughts ఉంచుకోవటం చేతనే మనం చేసే కర్మలన్నియూ నెగిటివ్‌గానే రూపొందుతున్నాయి.

మానవుని అరిషడ్వర్గములు చాలా ప్రధానమైనటువంటివి. వీటి ద్వారా ఆవిర్భవించేటటు వంటివన్నీ కూడా నెగిటివ్‌లే. ఈ Negative లను దూరం గావించుకొని Positive ను ప్రవేశింపజేసుకోవాలంటే ప్రేమతత్త్వం ఒక్కటే దీనికి మూలాధారము. మానవుని హృదయమును ప్రేమతో నింపినప్పుడే, సర్వమూ Positive పదార్థములే మననుండి ఆవిర్భవిస్తుంటాయి. ఈ ప్రేమ నుండి ఆవిర్భవించినటువంటివే ఈ సత్, చిత్, ఆనందములు. ఈ ప్రేమనుండి ఆవిర్భవించినటువంటివే కరుణ, దయా రసములు. పవిత్రమైన మానవతా విలువలు అన్నీ ఈ ప్రేమ ద్వారానే ఆవిర్భవిస్తున్నాయి.

మానవతావిలువలు అంటే ఏమిటి? హృదయమునుండి ఆవిర్భవించేటటువంటివే మానవతా విలువలు. కనుక హృదయమునందు ప్రేమమయ తత్త్వమును నింపుకోవాలి. హృదయము ప్రేమమయము అయినప్పుడే, మనం చేసే సర్వపనులూ ప్రేమమయంగానే ఉంటాయి. అటులకాకుండా హృదయం క్రూరభావము లతో నింపుకొనిన, మనం ఎన్ని పూజలు చేసినా వ్యర్థములే అయిపోతాయి. నీవు ప్రేమమయమైన జీవితాన్ని గడిపినప్పుడు, ఏ సాధనలు చేయునవసరం లేదు. జపములు, తపములు, ధ్యానములు - ఇవన్నీ కేవలం దేహముతో ఆచరించేటటువంటి Negative పనులే. అయితే ఈ Negative భావములు మానవుని యందు ఉండినంతవరకూ వీటిని మనం ఆచరించక తప్పదు. దేహాభిమానమే వీటన్నింటికీ మూలకారణము. దేహాభిమానము వదలుకోవటం అంత సులభమైన పని కాదు.

ఆత్మతత్త్వము దేహమనే భవనమునకు పునాది వంటిది. కేవలం భవనం చూచి ఆనందిస్తుంటే ప్రయోజనం లేదు. పునాది బలం మీదనే భవనం భద్రత ఆధారపడి ఉంటుంది. ఈ మానసిక తత్త్వములన్నింటికినీ ఆత్మనే మూలాధారము. కనుక ఈ ఆత్మభావము చేతనే మన జీవితాన్ని గడుపుతూ రావాలి. దేహం కేవలం భవనం లాంటిదే. ఈ భవనం యొక్క అందమును చూచి మనం ఆనందిస్తున్నాము. దీని భద్రత అంతయూ పునాది అయిన ఆత్మతత్త్వము మీదనే ఆధారపడి ఉంటున్నది. కనుక ఆత్మాభిమానంతో సలిపిన పనులు Positive గానే రూపొందుతాయి. విలువైన పరికరములు మన యందుంచుకొని విలువలేని భౌతిక సుఖములకై మనం ప్రాకులాడుతున్నాం. క్షణంలో మార్పుచెంది, మన ఆశలను నిర్మూలనం గావించేటటువంటి భౌతిక వాంఛలకు మనం గురి అవుతున్నాం. అనేక జన్మలనుండి ఈ భౌతికమైన వాంఛలు తనయందు యిముడ్చుకోవటం చేతనే అన్నీ భౌతికమైన భావములే తనయందు ఆవిర్భవిస్తున్నాయి. కనుక దినదినానికి క్రమక్రమేణ ఈ భౌతికాన్ని కొంతవరకు తగ్గించి, అభౌతికమైన ఆత్మతత్త్వాన్ని మన లక్ష్యము నందుంచుకోవాలి.

ఈ 'సత్, చిత్, ఆనందం' అనేటటువంటిది మనకు ఏవిధంగా లభ్యమవుతుంది? ఒక కీటకమును తెచ్చి చిన్న గూడులోపెట్టి, భ్రమరము శబ్దముగావిస్తూ చుట్టూ తిరగటం చేత, కీటకం కూడా భ్రమరంగా మారిపోతుంది. అదేవిధముగానే మనయందు సత్ చిత్ ఆనందం అనేది ఉన్నదో లేదో అనే భావమును విస్మరించి, నేను సత్, చిత్, ఆనంద స్వరూపుడ్ని... నేను సత్, చిత్, ఆనంద స్వరూపుడ్ని అని భ్రమరమువలె నిరంతరమూ స్మరిస్తుంటే తప్పకుండా మనం సచ్చిదానంద స్వరూపుడి

KOHINOO
Bangles
25 YEARS GUARANTEE
GOLD SHEET COVERED
ACID PROOF & CASH REFUNDABLE
ESTD:1901 PHONE:22630
KOHINOOR ROLLED GOLD
COMPANY (Regd)
P.B.No.10, MACHILIPATNAM-521 002 (A.P.)
INDIA

లక్ష్యము ప్రాణమయంగా చూచుకోవాలి. ఈ దేహమును కదిలించేది, మెదిలించేది ఏమిటది? అదే ఆ వైబ్రేషన్ అనేటటువంటి ప్రాణము. ఆ వైబ్రేషన్ అనేటటువంటి ప్రాణమే ఈ దేహమును అనేక విధములుగా చలింప చేస్తుంటుంది. ఇది కదిలిస్తుంటుంది కాని, ఇది సత్యమా?, నిత్యమా? అని విచారించేటటువంటి తెలివి లేదు.

గానే రూపొందుతాం. నేను సచ్చిదానంద స్వరూపుడ్ని నేను సచ్చిదానందస్వరూపుడ్ని, అనే పదములు నిరంతరం నీలో ఉచ్చరిస్తుండాలి. అప్పుడు ఈ భౌతికమైన దేహాభిమానం, క్రమక్రమంగా తగ్గిపోతుంది. నిత్యసత్యమైన ఆ సచ్చిదానంద స్వరూపం ఆవిర్భవిస్తుంది. కాని ఈనాటి మానవుడు అట్టి నిత్యసత్యమైన సచ్చిదానంద తత్త్వాన్ని గుర్తించుకొనలేక, అసత్యమైన, అస్థిరమైన, అప్రమాణమైన విషయములకే ప్రాధాన్యతనిస్తున్నాడు.

ప్రతి కార్యమునందు ప్రారంభములో కష్టములే కలుగుతుంటాయి. కాని కష్టములకు, బాధలకు ఏ మాత్రం క్రుంగిపోకూడదు. మానవుడు నిజంగా ఆనందస్వరూపుడే. మనయందు ఐదు కోశములుంటున్నాయి. 1. అన్నమయ కోశము, 2. ప్రాణమయ కోశము, 3. మనోమయ కోశము, 4. విజ్ఞానమయ కోశము, 5. ఆనందమయ కోశము. ఈ ఆనందమయ కోశమును చేరాలనుకుంటే మొట్టమొదట అన్నమయ కోశమైనటువంటి దేహాన్ని ప్రాణమయంలో చేర్చాలి. ఈ ప్రాణమయకోశాన్ని మనోమయకోశంలో ప్రవేశపెట్టాలి. ఈ మనోమయకోశమును విజ్ఞానమయ కోశములో ప్రవేశపెట్టాలి. అప్పుడే మనకు ఆనందమయ కోశమనేటటువంటిది ఆవిర్భవిస్తుంది.

అన్నమయకోశము ఈ దేహము. ఇది క్రమక్రమేణ నశించేటటువంటిదే. కనుక దీని నిమిత్తమై మనం ప్రాకులాడకూడదు. ఉండినంతవరకు దాని ఆరోగ్యమును కూడా చూచుకోవలసిందే. దాని కర్తవ్య కర్మలు కూడా మనం ఆచరించవలసిందే. అయితే మన మైండ్ అనే రేడియేషన్‌లో మనం ప్రవేశించాలి. ఈ రేడియేషన్ నుండి ఒక విజ్ఞానమయకోశంలో ప్రవేశించాలి. అదియే విచారణా శక్తి. అదియే constant Integrated Awareness. దానిని మనం పొందిన తరువాత ఆనందమే మన హక్కు. ఇక ఆనందమునకు మనం ఏమాత్రం ప్రాకులాడనవసరం లేదు. ఆనందమును ఏవిధంగా పొందాలనేటటువంటి వాంఛలు కూడా మనకు ఉండవు. తానే ఆనంద మయుడుగా మారిపోతాడు.

మానవత్వమనేది దివ్యత్వాన్ని పొందే నిమిత్తమై ఏర్పడినటువంటిదే కాని, కేవలం భౌతికమైన, లౌకికమైన, ప్రాకృతమైన సుఖసంతోషాలను అనుభవించే నిమిత్తమై కాదు. పశుపక్షి మృగాదులు, క్రిమికీటకాలు కూడా మనం ఆచరించే కర్మలే ఆచరిస్తున్నాయి. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదులు ఐదూ పశు పక్షి మృగాదులకు కూడా ఉంటున్నాయి. "జంతూనాం నరజన్మ దుర్లభం" అంటున్నారు. దేనిబట్టి నీయొక్క దుర్లభం చూపిస్తావు? అవి చేసేవే మనం చేస్తున్నాం. మనం చేసేవే పశు పక్షి మృగాదులు కూడా చేస్తున్నాయి. అది కాదు. దుర్లభమైనటువంటిది. దీనిని మనం స్వాధీనంలో ఉంచుకుని పశు పక్షి మృగాదులకు అతీతమైన స్థాయికి మనం వెళ్ళాలి. ఆ విధమైన మార్గమును ఎదగటానికే మొట్టమొదట మన తత్త్వాన్ని మనం గుర్తించుకోవాలి.

రూపనామములు వేరు వేరైనా అందరి యందు పంచ ప్రాణములు ఒక్కటే. కనుక అందరి యందు సమానంగా ఉండినటువంటి అద్వైతము ఏమిటి? పంచ

ప్రాణములే సమానత్వము. ఇదే కర్మాద్వైతము. ఇది వస్త్రము. ఇది వస్త్రము కాదు. దారముల యొక్క చేరిక. దారములు కాదు. ఇది ప్రత్తి. కాన ప్రత్తి, దారము, వస్త్రము మూడూ చేరి ఒక్కటే. ఇదే వస్తు అద్వైతము. మూడవది ప్రాణాద్వైతము. అనగా మనసు యొక్క అద్వైతము, కోటీశ్వరుడు చాలా ఖరీదైన ఆహారం తీసుకుంటాడు. బిచ్చగాడు గంజినీరు త్రాగుతాడు. కాని 'అన్నములు వేరు, ఆకలొక్కటే'. కనుక మానవత్వాన్ని చక్కగా విచారించుకుంటే, ఈ అద్వైత సిద్ధాంతమనేది అందరి యందునూ ఏకత్వంగానే ఉంటుంది.

అన్ని పర్వదినములూ మానవుని దైవత్వానికి చేర్చేటటువంటివే. దైవత్వాన్ని చింతించేటటువంటివే, దైవత్వాన్ని జ్ఞప్తికి తెచ్చేటటువంటివే, దైవత్వాన్ని మననం చేసేటటువంటివే, ఈ పర్వదినములు. కాని ఈనాడు ఆ దైవత్వాన్ని మననం చేయటం మానివేసి, తిండి తీర్థాలతో ఆ పర్వదినాలను అనుభవిస్తున్నాం. పర్వదినం అంటే పాయసం, పరమాన్నం చేసుకుని తినటమేనని భావిస్తున్నాము. అది కాదు. దివ్యత్వాన్ని చింతించి, ఆ దివ్యత్వములో ప్రవేశించి, దైవత్వాన్ని పొందేటటువంటిదే పర్వదినం.

ఇది శివరాత్రి. రాత్రి అనగా చీకటి. అనగా చీకటి లోపల శివం మంగళకరమైనది. ఈ రాత్రి అయినా శివనామంచేత రాత్రంతా జాగరణ చేయి. సంవత్సరము నకు ఒక్క దినమైనా సరే భగవంతుని యొక్క నామమును 24 గంటల సేపు ఉచ్చరించు. కాని ఈనాడు పర్వదినం. మేల్కోవాలనుకుంటున్నాం. రాత్రంతా దైవనామం చేస్తూ మేల్కోవాలి గాని మూడు సినిమాలకు వెళ్ళటంగాని, రాత్రంతా టి.వి. పెట్టుకోవటం గాని కాదు. ఇది కాదు జాగరణ. **"పేకాటలాడుచు ప్రీతితో వారాత్రి గడిపినందున జాగారమగునా?"** కార్డులు ఆడుతూ రాత్రంతా కాలక్షేపం చేస్తే జాగారమవుతుందా? కాదు.

మానవునికి 16 కళలు ఉంటున్నాయి. 15 కళలు లయమైపోయి ఒక కళ మాత్రమే ఉంటున్నది. ఈ శివరాత్రి దినం భగవత్ నామంతో రాత్రంతా గడిపినప్పుడు ఆ ఒక్క కళ కూడా లయమైపోతుంది. ఇది చాలా సులభమైన, పవిత్రమైనదినం. రాత్రంతా కూడా జాగరణ చేసి, మనం కాలమును పవిత్రంగావించుకొనినప్పుడు ఈ జీవితమే పవిత్రమైపోతుందని ఈ పర్వదినం అంతరార్థము. ఇది శివరాత్రి. అనగా అన్ని రాత్రులకంటే ఇది మంగళప్రదమైన రాత్రి. కనుక దైవచింతన చేత కాలమును సార్థకం చేసుకోవాలి.

ఒకానొక రాజు అనేకమంది పండితులను ప్రశ్నించాడుట. అన్నింటికన్నా తెల్లదైనది ఏమిటి? అని. కొందరు ప్రత్తి అన్నారుట. మరి కొందరు పాలు అన్నారు. ఇంకా కొందరు కొంగ అన్నారు. కాని ఒక పండితుడు మాత్రం పగలు తెల్లది, రాత్రి నల్లది అన్నాడుట. ఇది సత్యమైనటువంటిది. పగలు (Day) అనేటటువంటిది తెలుపు. అదే సాత్వికము. రాత్రి (Night) అనేటటువంటిది నలుపు. ఇది రజోతమో గుణములచేరిక. అయితే స్థితప్రజ్ఞులు మాత్రం దైవాన్ని చింతిస్తూ రాత్రంతా గడపుతారు. మామూలు ప్రజలు మాత్రం రాత్రి నిద్రపోతారు. స్థిత ప్రజ్ఞులలాగే ప్రతి రాత్రి దైవచింతన చేయటం వీలుకాకపోయినా, కనీసం సంవత్సరానికొక పర్యాయమైనా శివరాత్రి రోజున రాత్రి పవిత్రమైన దైవనామ చింతన చేత కాలమును సార్థకం చేసుకోవాలి. ముఖ్యంగా ఈనాడు మన హృదయంలోపల Negative Thoughts లేకుండా దూరం చేసుకోవాలి. అరిషడ్వర్గములతో మన హృదయాలు నిండి ఉన్నాయి. అసూయాద్వేషములు మననుండి ఆవిర్భవిస్తున్నాయి. మనలో కించిత్ అయినా ప్రేమ, దయలు కనిపించటంలేదు. కనుక మన హృదయమును ప్రేమతో నింపినప్పుడు, సర్వవేళలా ఏపని చేసినా ప్రేమమయంగానే ఉంటుంది. ఏది మాట్లాడినా ప్రేమమయంగానే ఉంటుంది. ఇదే Positive. మానవుడు Positive లక్షణాలను పెంచుకోవాలిగాని, Negative లక్షణాలను పెంచుకోకూడదు. దయ, ప్రేమ, సహనము, సానుభూతులను పెంచుకోవాలి. భౌతికమైన వాంఛలను పెంచుకోకూడదు. దివ్యమైన వాంఛలను పెంచుకోవాలి.

Help Ever, Hurt Never. చెడ్డ కార్యాలలో మనం ప్రవేశించకూడదు. మంచిచేసేది చేతులే, చెడ్డచేసేది

చేతులే. కాబట్టి చెడ్డ చేసే బదులు మంచిచేసి ఆనందాన్ని అనుభవించండి. పవిత్రమైన కర్మలలో ప్రవేశించండి. Hurt చేయటం Negative. Help చేయటం Positive. పవిత్రమైన మాటలతో హృదయాన్ని ఆనందపరచటం Positive. అప్రియమైన మాటలతో మరొకరి మనసును గాయపరచటం Negative. కనుక ఒకరిని బాధపెట్టవద్దు, నీవు బాధపడవద్దు. ఒకరిని నొప్పిస్తే అంతకు పదిరెట్లు నీవు నొప్పి పడవలసివస్తుంది. కనుక నొప్పించకు, నొప్పిపడకు. కనుక మానవుడు ఈనాడు Negative Thoughtsను క్రమక్రమేణ తగ్గించుకుంటూ పోవాలి. దుర్వాంఛలను తగ్గించుకోవాలి. వీటిని ఎంత తగ్గించుకుంటే అంత మనశ్శాంతిని పొందుతాడు మానవుడు.

ప్రతి మానవుడు ఆనందమయుడు కావాలి. భౌతికమైన, క్షణ భంగురమైన ఆనందం కాదు. క్షణ భంగురమైన ఆనందం మనకు శాంతిని యివ్వదు. శాశ్వతమైన ఆనందమే మనకు శాంతిని చేకూరుస్తుంది. కనుక ఇటువంటి పవిత్రమైన భావములచేత మన జీవితాలను సార్థకం చేసుకోవాలి.

*ప్రేమస్వరూపులారా!*

ప్రతి మానవుడు ప్రేమమయుడే. ప్రేమమయుడైన మానవుడు ప్రేమనే పెంచుకోవాలి. ప్రేమను ఎంతపెంచుకుంటావో, ఆనందం కూడా అంత పెరిగిపోతుంది. ఎంత ఆనందాన్ని నీవు అనుభవిస్తావో, అంత హాయిని నీవు పొందుతావు. అదియే శాంతి. ఒక విషయాన్ని మీరు గుర్తించాలి. 72 సంవత్సరములు వచ్చినప్పటికినీ నాలో ఈనాటి వరకు Negative Thoughts అనేవి రాలేదు. కనుకనే నాకు ఎవ్విధమైన రోగములులేవు. నేనెప్పుడూ ఆనందంగానే ఉంటున్నాను. కొంతమందిని సరైన మార్గంలో పెట్టే నిమిత్తమై కొంత కఠినంగా మాట్లాడుతుంటాను. అవి Negative పదములు కావు. ప్రేమతో కూడిన పదములే. నా గుండె చూస్తే ఒక పెద్ద ఇనుపగుండువలె ఉంటుంది. ప్రాపంచికంగా చూస్తే వెన్నముద్దవలె ఉంటుంది. తెల్లవారుజామున లేచిన మొదలు, రాత్రి పరుండేవరకు భక్తులను చూస్తుంటాను. వారిచ్చే లేఖలు చూస్తుంటాను, అందరికీ తగిన ఆనందాన్ని అందిస్తుంటాను. ఆఫీసర్లకు Sunday శలవుంటుంది. నాకు శలవేలేదు. నేను ఎల్లప్పుడూ పనిచేస్తూనే ఉంటాను. నేనెప్పుడూ Rest కావాలని ఆశించలేదు. నేను ఎప్పుడూ Rest గానే ఉన్నాను. కారణమేమిటి? Negative Thoughts లేకపోవటమే. ఈ దేహాభిమానం నాకు లేదు. ఈ దేహము మీ కోసమే. ఈ దేహాభిమానం ఉండినప్పుడే ఈ దేహమునకు తగిన Rest కావాలి. నేను ఏమి చేసినా, ఏమి చెప్పినా, ఏ కర్మలనాచరించినా మీ నిమిత్తమేగాని, నా నిమిత్తం కోసంకాదు. నేను ఎప్పుడూ మిమ్ములను కోరేది ఒక్కటే. మీ హృదయాలను ప్రేమతో నింపుకోండి. అది ఒక్కటి మాత్రమే నాకు అందించండి. నేను ఎవ్వరిని ఏమీ అడగటంలేదు. మీరు ప్రేమగా ఉంటుండి, మీ ప్రేమను పదిమందికి పంచి, మీరు ఆనందించి, పదిమందిని ఆనందపెట్టండి. మీరు Happy గా ఉండినప్పుడే పదిమందికి Happy ని అందించగలుగుతారు. ఈ Happy ఎక్కడ నుంచి వస్తుంది? విచారిస్తే Happiness Lies in the Union with God. భగవంతుని నామంచేతనే Happiness లభిస్తుంది. ఈవిధంగా సాధనల ద్వారా జీవితాన్ని సార్థకం చేసుకోవాలి గాని జపధ్యానముల ద్వారా కాదు. ప్రాపంచికంగా చేసుకోండి. అవి కాలమును సార్థకం

## విదురనీతి

"సత్కృతాశ్చ కృతార్థాశ్చ
మిత్రాణాం న భవన్తియే
తాన్ మృతానపి క్రవ్యాదా:
కృతఘ్నాన్నోప భుంజతే"

మిత్రుల చేత సత్కరింపబడి, వారి సహాయముతో కృతార్థులైయున్న, ఎవరు మిత్రులకు కాకుండా పోవుచున్నారో, అట్టి కృతఘ్నులు మరణించిన పిదప, వారి కళేబరములను, మాంసము భుజించు జంతువులైనను భుజించవు.

గావించుకొనే నిమిత్తం చేసే కర్మలే. నిజమైన శాంతి చిక్కేందుకు చేసే మార్గం అదికాదు. హృదయాన్ని Positive గా మార్చుకోవటమే నిజమైన శాంతి.

ప్రాపంచికంగా జపములు చేయండి, ధ్యానం చేయండి. భజనలు చేయండి. ఇత్యాది సత్కర్మలను ఆచరించటం వలన కర్మలను మాత్రం సార్థకం చేసిన వారవుతారు. కాలము చాలా ప్రధానమైనది. కాలము పరమాత్మ స్వరూపము. ఆ కాలమును సార్థకం చేయటానికి సత్కర్మలు అత్యవసరములే. కాని ఈ కర్మలను మాత్రమే ఆచరిస్తూ కూర్చుంటే ప్రయోజనం లేదు. ఈ కర్మలు అన్నీ భౌతికమైనటువంటివే. హృదయంతో కూడినటువంటి నిజమైన కర్మలు ఆచరిస్తూ రావాలి. అప్పుడే మనకు ఏవిధమైన రోగములు రావు. రోగములు రావటంచేత అశాంతి కూడా పెరుగుతుంది. తద్వారా ఆనందంకూడా తరుగుతుంది. నీవు Healthy గా ఉండాలి, మరియు Happy గా ఉండాలి. పవిత్రమైన భావములతో నీ హృదయాన్ని నింపుకొనినప్పుడు Healthy, Happy ఉంటాయి. కనుక మన హృదయంలో ఏ మాత్రం చెడ్డ భావములు ప్రవేశించకుండా చూచుకోవాలి. ఎవరిపైన ఏవిధమైన ద్వేషం ఉండకుండా చూచుకోవాలి. నాకు ఎవ్వరిపైన ఏ విధమైన ద్వేషంలేదు. కనుకనే నాపైన ఎవ్వరికీ ద్వేషంలేదు. నాకు అందరూ ప్రేమమయులే. నాదృష్టిలో అందరూ ప్రేమస్వరూపులే. అందరూ క్షేమంగానే ఉండాలి. అందరూ ఆనందాన్నే అనుభవించాలి. అటువంటి విశాలమైన భావం నాలో ఉండబట్టే నాదగ్గరకు యింత మంది వస్తున్నారు. ఇన్ని దేశాలవారు వస్తున్నారు. నాలో ఏమాత్రం స్వార్థంలేదు. నాకు ఎట్టివాంఛలూలేవు. నాకు ఉన్నది ఒకటే వాంఛ, అదే 'లోకాస్సమస్తా సుఖినో భవంతు.'

ఈనాడు లోకంలో ఇన్ని విధములైన దుఃఖములకు, బాధలకు, కష్టములకు కారణమేమిటి?

**"పాపభీతిలేని పామరత్వము పట్టె**
**దైవ ప్రీతిలేని దానిపట్టె**
**మానవత్వమణగె మానవులందున**
**విశ్వశాంతికిదియె విప్లవంబు"**

కనుక పాపభీతి, దైవ ప్రీతి - ఈరెంటిని మనం పెంచుకోవాలి. అప్పుడు సంఘంలో నీకు కావాల్సినంత గౌరవం లభిస్తుంది. ఈ రెండూ లేకుండా ఏ సంఘం నిన్ను గౌరవించదు. మొట్టమొదట దైవప్రీతిని పెంచుకోవాలి. ఈ దైవప్రీతిని నీవు పెంచుకుంటే, నీకు పాపభీతి సహజంగా లభ్యమవుతుంది. ఈ రెండింటి యొక్క ఏకత్వం చేతనే సంఘనీతి వస్తుంది. సంఘంలో నీవు గౌరవాన్ని అందుకోగలవు.

పవిత్రమైన ప్రేమతత్త్వాన్ని మనం ఈనాడు పెంచుకోవాలి. ఈ ప్రేమచేతనే మన జీవితం సార్థకం గావించుకోవాలి. అందరినీ విశ్వసిస్తాను. తప్పు చేసిన వానిని కూడా విశ్వసిస్తాను. ఎవ్వరిపైన నాకు ద్వేషం లేదు. ఎవ్వరినీ నేను ద్వేషించను. కనుకనే ప్రపంచమంతా నన్ను ప్రేమిస్తున్నది. కనుక ఈ ప్రేమకు మూలకారణం విశ్వాసమే. విశ్వాసానికి మూలకారణము దివ్యమైన సత్యమార్గము. ఈ సత్యమార్గమునకు మూలకారణము దివ్యత్వము. కనుక ఈ దివ్యత్వమనేటటువంటిది ఈ సత్యమార్గములో ప్రవేశించి, విశ్వాసం చేత ప్రపంచమంతా ఏకంగా భావించాలి. అందరూ సోదరత్వాన్ని పెంచుకోవాలి. అప్పుడే మానవత్వం లోపల దివ్యత్వం ప్రారంభమవుతుంది. అప్పుడే మానవత్వం ప్రకాశిస్తుంది. అందరికీ ఆదర్శవంతమైన మానవుడుగా తయారవుతాడు.

నేను అప్పుడప్పుడు "దివ్యాత్మస్వరూపులారా!" అని సంబోధిస్తుంటాను. అందరూ దివ్యాత్మస్వరూపులే. ఎప్పుడు? ఈ ప్రేమతత్త్వాన్ని మీలో పెట్టుకున్నప్పుడు దివ్యాత్మస్వరూపులవుతారు. దివ్యాత్మస్వరూపులు కావాలంటే దివ్యప్రేమను పెంచుకోవాలి. ప్రతి మానవుడు ప్రేమను పెంచుకోవాలి. దైవాన్ని ప్రేమించండి. ఈ ప్రపంచం లోపల ప్రేమించతగ్గది ఒక్కటే ఒక్కటి. అదే దైవము. తల్లి తండ్రీ వీరందరూ లోకరీతిగా ప్రేమించవలసినటువంటివారు. అందరూ అశాశ్వతమే. శాశ్వతమైన తత్త్వము దైవత్వమొక్కటే. ఆ దైవత్వాన్ని మీరు ప్రేమించి, దివ్యత్వాన్ని పెంచుకొని, పవిత్రతను సార్థకం చేసుకోండి. ఇదే నిజమైన శివరాత్రి సారము. నిరంతరమూ దైవ నామాన్ని స్మరించండి. ఏ పనిచేసినా ప్రేమతో చేయండి. వాంఛలు తగ్గించుకోండి. సేవలలో ప్రవేశించండి. ప్రతి

మానవుడిని గౌరవించడం నేర్చుకోండి. అప్పుడే నీలో దివ్యత్వం ఆవిర్భవిస్తుంది. శాశ్వత ఆనందమును అందించేటటువంటిది ప్రేమ మార్గము ఒక్కటే. మిగతావన్ని తాత్కాలిక ఆనందమును చేకూర్చే టటువంటివే.

ప్రేమ మార్గము జగత్తునంతా ప్రేమమయంగా మార్చి వేస్తుంది. ఆ ప్రేమనే భగవత్ స్వరూపుడు. ఆ సత్యమే భగవత్ స్వరూపుడు, ఆ శాంతమే భగవత్ స్వరూపుడు. అదియే సత్, చిత్, ఆనందములు. దేహమే జీవుడు, ఆత్మనే దేవుడు. సచ్చిదానందము అనేటటు వంటిది ఆత్మతోను, దేహముతోను కూడినటువంటిది. దేహము లేకపోతే ఆత్మ మనకు తెలియదు. ఆత్మ లేకపోతే దేహమే ఉండదు. ఈ రెండింటి యొక్క ఏకత్వమే దేహాత్మ స్వరూపము. ఈ విధమైన మార్గమును అనుభవించి, దివ్యమైన సేవలు ఇతరులకు చేసి, దైవత్వాన్ని మనం అనుభవించడానికి తగిన కృషి చేయాలి. ఇదియే శివరాత్రి యొక్క ప్రధానమైన అంతరార్థము. ఈ ఒక్కరాత్రి అయినా దైవనామం చేస్తూ గడపండి. ఎన్ని రాత్రులో మీరు అపవిత్రం చేస్తున్నారు. సంవత్సరానికి ఈ ఒక్క రాత్రి అయినా సద్వినియోగం చేయండి. ఇదే నిజమైనటు వంటి సార్థకమైన రాత్రి. "ఇదియే శివరాత్రి మిగిలినవి అన్నీ

*(ది. 25-2-1998 శివరాత్రి పర్వదినాన ప్రశాంతి నిలయంలో భగవాన్ సాయి చేసిన దివ్య ప్రసంగము నుండి)* ☆

## పదాల పందిరి - 10 సమాధానాలు

*అడ్డం :* 1. మమత, 3. పానుపు, 5. రంగేళి, 7. వధ, 9. మస్కా, 10. రిగ, 11. తహా, 12. అత్రి, 14. తిల, 16. కానుక, 18 వలపు, 19. శోధన.

*నిలువు :* 1. మగువ, 2. తరం, 3. పాళి, 4. పురస్కా, 6. గేలి, 8. ధరిత్రి, 9. మహతి, 12. అతివ, 13. జీను, 15. లవన, 16. కాపు, 17. కశో.

## పదాల పందిరి - 11

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | X | 3 | | 4 |
| | X | 5 | 6 | | X | |
| 7 | 8 | X | | X | 9 | |
| X | 10 | | X | 11 | | X |
| 12 | | X | 13 | X | 14 | 15 |
| | X | 16 | | 17 | X | |
| 18 | | | X | 19 | | |

**ఆధారాలు :**

**అడ్డం :** 1. మహాత్మ, 3. సరస్వతీ దేవి, 5. గాడిద, 7. పుష్పము, 9. కోరిక; హోప్, 10. సర్ప నివాస స్థానం, 11. తెలుగులో సింగింగ్, 12. వదలు (క్రియ), 14. దంచుట, 16. భూమిలోపలి రహస్య మార్గం, 18. ప్రముఖ తెలుగు హాస్యనటుని ఇంటిపేరు, 19. యవ్వనంలోని స్త్రీ.

**నిలువు :** 1. రిక్వెస్టు !, 2. ఒక నక్షత్రం; 'పుబ్బ' తోడిది, 3. వికృతమైన 'గృహము', 4. పార్వతీదేవి, క్రిందనుండి, 6. కాన్సిల్ చేయుట, 8. రాజు, 9. సంతోషం, ప్రమోదం, 12 'విభవ'తో సంపద, 13. ప్రగల్భం, 15. నావ నడుపు తెడ్డు, 16. 'ఆనప'కాయ, 17. తిరగబడ్డ 'జగం'.

**-కిరీటి**

# అమ్మా నాన్నా పోయారు!

హిమాలయాలలో ఒక సన్యాసి ఉండేవాడు. ఆయన క్రమశిక్షణకూ, కఠోర సాధనలకూ పెట్టిన పేరు. తన ఆధ్యాత్మిక సాధనలేమో, తానేమో - ఇంకేవి ఆయనకు పట్టేవికావు.

సామాన్యంగా ఆయన తెల్లవారుఝామునే లేచి, వదికి వెళ్ళి, స్నానం చేసి అక్కడే చాలాసేపు జపం చేసుకొనేవారు. అలాంటిది ఒక రోజు ఆయన కాస్త పొద్దెక్కినదాకా నిద్ర లేవలేదు. పైగా లేస్తూనే తన శిష్యుని భార్యను పిలిచి, 'నాకు ఆకలవుతోంది. ఏదైనా పెట్టు. చద్దెన్నం అయినా సరే!' అని అడిగాడు.

ఆవిడ ఆశ్చర్యపడి 'స్నానం చేసి వచ్చారా?' అనడిగింది.

ఆ సన్యాసి 'అవసరంలేదు' అని పాచి మొహాన్నే, శుభ్రంగా చద్దెన్నం లాగించేసి మళ్ళీ మంచం తన్నిపెట్టి పడుకుని నిద్రపోయాడు.

ఇంక ఆ శిష్యుని ఇంటిల్లిపాదీ ఒకటే కంగారు. స్వాముల వారికి సాధనలు చేసి చేసి మతి భ్రమించి ఉంటుందని నిశ్చయించారు. శిష్యుడు వెళ్ళి ఒక డాక్టర్ని పిలుచుకొని వచ్చాడు. వస్తూ ఆయన డాక్టరు గారితో 'స్వామి, మిమ్మల్ని పరీక్ష చేయనిస్తాడో, లేదో? కేవలం దర్శనంకై వచ్చానని చెప్పండి'! అని కూడా చెప్పాడు.

ఈలోగా ఈ వార్త ఊరిలో పాకింది. సన్యాసి శిష్యులలో మరో యిద్దరు డాక్టర్లున్నారు. వాళ్ళూ వెంటనే వచ్చారు. సన్యాసి స్నేహితుడైన మరో యోగి కూడా అక్కడికి వచ్చాడు.

అంతా అక్కడకు చేరేసరికి సన్యాసి గాఢ నిద్రలో ఉన్నాడు. ఒక డాక్టరు 'కోమాలోకి పోయా'డన్నాడు. దాంతో ఇంటిల్లిపాదికి దుఃఖం వచ్చింది. ఇంతలో సన్యాసికి మెలకువ వచ్చి లేచి కూర్చున్నాడు. స్నేహితుడినీ, మిగిలినవాళ్ళనూ చూసి 'రాం! రాం! ఏమిటి సంగతి?' అనడిగాడు.

'రాం! రాం! మీ వంట్లో ఎలా ఉంది?' అని అడిగాడు మిత్రుడు.

'నాకేం, నిక్షేపంగావున్నా' అన్నాడు సన్యాసి.

'మీరివాళ స్నానానికి వెళ్ళలేదుట. వంట్లో ఎలా ఉందో, ఏమోనని వీళ్ళంతా కంగారు పడుతున్నారు!' అని నెమ్మదిగ నూట వెళ్ళబెట్టాడు, ఆ స్నేహితుడు.

"ఓ, అదా!" అన్నాడు సన్యాసి తాపీగా. 'ఇవాళ మా అమ్మా, నాన్నా పోయారు."

"మనం సన్యాసులం. మనకు అమ్మా, నాన్నా, బంధువులూ ఎవ్వరూ లేరు...." అంటూ ఏదో చెప్పబోయాడు మిత్రుడు.

'నాకే కాదు, మీకూ ఉన్నారు. లంపటం నా తల్లి. కోపం నా తండ్రి. ఈ రోజుతో ఆ యిద్దరిపనీ అయిపోయింది. ఈ రోజునుండీ నాకు జపం అవసరంలేదు. ఆత్మానందం నా సహజస్థితి' అన్నాడు చిరునవ్వుతో ఆ స్వామి.

- భండారు పర్వతాలరావు

# యక్ష ప్రశ్నలకు సమాధానాలు

"శృణు యక్ష కులం తాత
 నస్వాధ్యాయో న చశ్రుతమ్
కారణం హి ద్విజత్వే చ
 వృత్తమేవ నసంశయః"

*ఓ తండ్రీ! యక్షా! విను!* కులమూ వేదాధ్యయనమూ, శాస్త్రశ్రవణమూ - వీటిలో ఏదీ బ్రాహ్మణత్వాన్ని ఇవ్వలేదు. సదాచారమొక్కటే బ్రాహ్మణత్వాన్ని ఇస్తుంది. ఇందులో సందేహంలేదు.

# సామీప్య ముక్తి

**1) సామీప్య ముక్తి :** ప్రతి మనిషి జీవితమూ ఒక అద్భుతమైన Thrilling ప్రయాణం వంటిదే! నిమిషాలూ, గంటలూ, రోజులూ, నెలలూ, సంవత్సరాలూ గడుస్తున్న కొద్దీ మనిషి ఎదగటంతోపాటుగా అతని యొక్క లక్ష్యానికి సమీపంగా అతడు కదులుతూ ఉంటాడు! మన లక్ష్యాలు ఎంతో ఉన్నతమైనవి అయినప్పటికీ అవి మనం చేరలేనటువంటి ఆదర్శ శిఖరాలుగానే మిగిలిపోతే అటువంటి ఆదర్శాలవల్ల ఏమిటి ప్రయోజనం?

అటువంటి Idealism కాదు మనకు కావలసింది. ఆ Ideals ను అనుభవించే Realism కూడా మనలో అలవడాలి! లేకపోతే వాస్తవానికీ, ఆదర్శాలకూ ఒక అఘాతం ఎప్పటికీ ఉండనే ఉంటుంది.

"One Step is Enough" అనేవారు మహాత్మాగాంధీజీ! అంటే తన ఆశయ సాఫల్యం కోసం ఒక్క అడుగు ముందుకు వెళ్ళినా చాలు. అలాంటి అడుగులు ఎన్నో, ఎన్నో వేసి చివరికి లక్ష్యాన్ని చేరుకోవటం జరుగుతుంది. "Rome is not built in a day" ( రోమ్ నగరాన్ని ఒక్క రోజులో నిర్మించలేదు.) "Stroke by stroke make the great oak to fall" (చిన్న చిన్న కొడవలి దెబ్బలే గొప్ప గొప్ప ఓక్ మహావృక్షాలను కూల్చివేశాయి.) ఇటువంటి సూక్తులను అర్థం చేసుకొంటే లక్ష్యానికి సమీపంగా వెళ్ళటం ఏమిటో తెలుస్తుంది. భౌతికంగా దూరం కాదు చూడవలసింది. మానసికమైన సామీప్యాన్ని మన లక్ష్యం విషయంలో ఎప్పటికీ అనుభవిస్తూ ఉండాలి. చివరకు అటువంటి మనస్సు తన లక్ష్యాన్ని తప్పక కలుసుకోగలుగుతుంది. శ్రీ కృష్ణపరమాత్ముడు ఉద్ధవుని ద్వారా బృందావనంలో తన కోసం నిరంతరం వేయికళ్ళతో ఎదురుచూచే గోపికలకు ఈ సందేశాన్ని వినిపించుతాడు. "వియోగంలోనే సంయోగాన్ని చూడండి" అంటాడు. శ్రీకృష్ణ పరమాత్ముడు. మానసికంగా దగ్గరగా ఉండటమే కావలసింది; భౌతికంగా దూరం, దూరం కాదు. ఇటువంటి మానసిక స్థితిలోనే విసుగులేని రీతిగా లక్ష్యసిద్ధికోసం కృషి చేయటం సంభవిస్తుంది! అందుకు ఆధునిక శాస్త్రజ్ఞుడు శ్రీ థామస్ ఆల్వా ఎడిసన్ జీవితమే ఒక ఉదాహరణ. ఈనాడు మనం హాయిగా స్విచ్‌వేసి వెలిగించే ట్యూబులైటును కనిపెట్టిందివారే! తాను ఊహించిన ట్యూబులైటును విద్యుత్తులో వెలిగించటం కోసం వారు పదివేలసార్లు ప్రయోగాలు జరిపారు. వారి ప్రయోగాలు విఫలం అవుతూ ఉంటే చూచేవారికి విసుగుకలిగింది కానీ వారికి మాత్రం విసుగు కలగలేదు! 'నీవు ఈ ప్రయత్నాన్ని మానుకో. ఎందుకు వృథా ఖర్చు? ఎందుకు కాల వ్యయం?' అన్నారు అంతా! కానీ వారు మాత్రం వైఫల్యంలో కూడా తాను తన లక్ష్యాన్ని సమీపించుతున్నట్లే భావించేవాడు.

## పాతూరి ప్రసన్నం

" This man, whose responsibilities are heavy, works from morning till night without interruption, but always seems able to assume new obligations. He has the knack of handling his work easily with efficiency.

" He is a well organised individual with no energy leaks in his make-up. "He is nature's man. He is completely in harmony with nature and God. In him there are no obsessions, no disorganisations, no conflicts, no mental quircks, no emotional instability. He drew his energy from emotional self mastery, and the ability to relax completely. He has been a person in tune with the infinite.

He is on fire for something. He is pouring himself out, and, yet never loses energy, and vitality in doing so.

You only lose energy when life becomes dull in your mind. Your mind gets bored and therefore lives doing nothing......................Get interested in doing something" అంటారు శ్రీ నెపోలియన్.

మానసికంగా "లక్ష్యానికి అత్యంత సన్నిహితంగా ఉన్నాను; లక్ష్యంతో ఒకట్టై ఉన్నాను" అనే భావనకు రూపకల్పనగా పైన వర్ణించిన శ్రీ ధామస్ ఆల్వా ఎడిసన్ వ్యక్తిత్వాన్ని మనం ఉదాహరణగా తీసుకోవాలి.

దగ్గర, దూరం అనేవి Relative Terms; అనగా సాపేక్ష సంబంధం కలిగినట్టివి. సృష్టిలో అత్యంత వేగవంతమైనది. కాంతికిరణం అని సైన్సు నిరూపించింది. అది సెకండు 1,70,000 కి. మీ. వేగంతో పోతుంది. మనస్సు అంతకంటే ఎన్నో రెట్లు వేగంగా పోగలదు అనటం ఒక ఆధ్యాత్మికమైన సిద్ధాంతం కాదు; ఒక యదార్థమైన వాస్తవ సత్యం! అందుకే 'మనోవేగం' అన్నిటినీ మించిన వేగం అన్నారు.

వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దుకొని, శారీరక, మానసిక ఆధ్యాత్మిక శక్తులను మేల్కొల్పి వాటికి క్రియా శీలతను కల్పించటం ద్వారా, మన మనస్సును మాత్రం ఎప్పుడూ మన లక్ష్యానికి చేరువగా ఉంచటమే సామీప్య ముక్తి యొక్క లక్షణం!

# సుభాషితములు

"ఖలో మృగయతే దోషం
గుణ పూర్ణేషు వస్తుషు
వనే పుష్పఫలాకీర్ణే
పురీషమివ సూకరః"

*మంచి పుష్పములతో, ఫలములతో నిండియున్న తోటయందు పంది మలము కొసమే వెతుకును. అదే విధముగ నీచుడు మంచి గుణములతో నిండిన వస్తువుల యందు కూడా దోషమునే వెతుకును.*

**2) సారూప్య ముక్తి :** ప్రతి మనిషి ఎన్నెన్నో మంచికలలు కంటూ ఉంటాడు. మంచి కలలు కనటంలో తప్పులేదు. కానీ కలలు కల్లలుగా మిగిలిపోతే అమూల్యమైన బ్రతుకే ఒక కల్ల అయిపోతుంది. " Life is a dream. Realise It" అంటారు భగవాన్ శ్రీ సత్యసాయిబాబా! మంచి మంచి కలలను యదార్థం చేసుకోవాలి ఈ జీవితంలోనే! అంటే ఆ కలలకు ఒక వాస్తవికమైన రూపాన్ని కల్గించాలి అని అర్థం. అదే జీవిత సాఫల్యం! వడివడిగా ప్రవహించే కాలప్రవాహంలో కదిలిపోయే అలలవంటివి క్షణాలు, రోజులూ, సంవత్సరాలూ! కదిలిపోయే కాలంలో బ్రతుకుతూ కూడా చలించని మనస్సుతో, భ్రమించని దృష్టితోనూ, ప్రతి వ్యక్తీ తన లక్ష్యానికి ఒక ఆకృతిని రూపొంగించుకోవాలి. అంతేకాదు. తన వ్యక్తిత్వాన్ని తన లక్ష్యానికి అనుగుణంగా వికసింపజేసుకోవాలి. సారూప్యముక్తిలోగల పరమార్థం ఇదే. మనస్సు యొక్క వికాసంలో ఇది మూడవమెట్టు. మొదటి మెట్టు ఒక మానసిక ప్రపంచాన్ని నిర్మించుకోవటం, రెండవమెట్టు కృషిచేస్తూ బ్రతకటం. తన లక్ష్యంతో అత్యంత సామీప్యాన్ని, సన్నిహితత్వాన్ని అనుభవిస్తూ కృషిచేయటం. Be a Roman in Rome (నీవు రోమ్ నగరంలో ఉంటున్నప్పుడు రోమన్‌వలె ఉండు.) అన్నారు. వైకుంఠంలో చేరిన ముక్తి పొందిన జీవులందరూ శ్రీ మహావిష్ణువువలె ఆకారాన్ని ధరించి ఉంటారుట! సారూప్యముక్తి అంటే ఇదే!

సాలోక్యానికీ, సారూప్యానికీ గల తేడాను మనం గుర్తించాలి. "సాలోక్యం"తో మనలోకం మారిపోతుంది. కానీ రూపంమారదు. "సారూప్యం"తో రూపం కూడా మారిపోతుంది. ఒక భ్రమరం ఒక కీటకాన్ని తెచ్చి తన గూట్లో ఉంచింది. అదే "సాలోక్యం". భ్రమరం తన ఝుంకారంతో కీటకం చుట్టూ తిరుగుతూ ఉండగా కీటకం యొక్క స్వరూపం మారి, అది కూడా భ్రమరవే అయిపోతుంది! సారూప్యముక్తి యొక్క ఆంతర్యం ఇదే! "నేను మంచివాణ్ణి" అని ప్రకటించితే చాలదు. మంచివాని యొక్క రూపం కూడా సాత్త్వికంగా, మంచిగా ఉండాలి. మనసు లోపల చెడుపెట్టుకొని, బాహ్యంగా మంచిగా నటించటాన్ని మిధ్యాచారం అంటుంది గీత! మనస్సు

మంచిది కావాలి. రూపమూ మంచిది కావాలి. ఈ రోజుల్లో యువతరం వారి మనస్సులు మంచివే కావచ్చు. కాని వారి ఆకృతులు మాత్రం చాలా వికృతంగా తయారవుతున్నాయి. లంకలో ఉండేది అందరూ రాక్షసులే అయినా కూడా, విభీషణుని ఇల్లు, వాతావరణం, రూపం చూచి "ఆయన రాక్షసుడుకాడు; సత్త్వగుణ సంపన్నుడు; రామభక్తుడు," అని ఆంజనేయస్వామి గుర్తించగలిగాడు!

మన జీవిత విధానం, మన లక్ష్యం, లక్ష్యసిద్ధి కోసం ఒక విశిష్టమైన స్వరూపధారణం అన్నీ పరస్పరం ఎంతో సంబంధం కలిగినట్టివి. ఒకటి మరొకదానిని ప్రభావితం చేస్తుంది! శ్రీరాముని, శ్రీ కృష్ణునివంటి అవతార పురుషుల పాత్రలను సినిమాల్లో నటిస్తున్న రోజుల్లో తాము పూర్తిగా సాత్త్వికాహారం తింటూ, దైవార్పితమయిన చిత్తంతో, తమ పాత్రలలో విలీనంఅయి నటించాము అంటూ మన సినిమా నటులు చెబుతూ ఉంటారు! అంటే తాము ధరించే ఒక అవతారపురుషుని పాత్రను గూర్చిన నటనకు న్యాయం చేయటం కోసం, తమ యొక్క వ్యావహారిక జగుత్తులోని ఆహార విహారాలను కూడా దానికి అనుగుణంగానే నిర్వహించటంలోని ఆంతర్యం కూడా ఈ సారూప్యతకు సంబంధించినట్టిదే! తెరమీద నటించటం కొరకే ఇంత సారూప్యత అవసరం అయితే - నిజ జీవితంలో ఆ విలువలు అనుభవించటంలో కూడా ఈ 'సారూప్యత' అక్కర్లేదంటారా? దీనినే "Identity" అని కూడా చెప్పవచ్చు. ఆశయాలకు అనుగుణంగా ఆకారాలు ఉండితీరాలి అనటం ఒక యదార్థమే!

> "ధనధాన్యములు నాకుదండిగా నీకున్న
> ఈమహా సంసారమీదలే గాని
> ఆరోగ్యమొసగుచు ఆదుకోవలెగాని
> వైద్యుల మందులు వాడలేను
> సామరస్యముగూర్చి సంధింపవలెగాని
> నేనీ సమాజాన నిల్వలేను
> నేజేయు పనులను నీవిగా భావించి
> తప్పుసై రింపకే తాళలేను
> భారమంతయు నీదయ్య పరమ పురుష
> కానిచో నన్ను నీలోన కలుపుకొనుము
> జాలమేటికి ననుగావ సార్వభౌమ
> సర్వమీవే గదా నాకు సత్యసాయి !"
>
> \- సముద్రాల వెంకట రంగనాథస్వామి

భగవాన్‌శ్రీసత్యసాయిబాబావారు సారూప్యతను గూర్చి ఇలా అంటారు.

"ఒక శిల్పిగానీ, ఒక చిత్రకారుడుగానీ మొట్టమొదట తనలో భావచిత్రాన్ని కొంతవరకు నిర్మించుకొని, రూపకల్పన చేసుకొని, దాని ప్రతిబింబాన్ని బహిర్ముఖమైన తాను చిత్రిస్తూ ఉంటాడు. ముందు అంతరంగమందు చిత్రించుకొనక బహిర్ముఖమున దానిని చిత్రించటానికి వీలుకాదు. అదే రీతిగా మన మనస్సుకు మనమే రూపాన్ని నిరూపణ చేస్తున్నామో, ఏ రూపాన్ని కల్పిస్తున్నామో, ఎట్టి రూపంతో దానిని అలంకరింపజేస్తామో అట్టి స్వభావాన్ని, అట్టి స్వరూపాన్ని అది పొందుతూ ఉంటుంది.

ఒక భక్తునికి దైవం సాక్షాత్కరించాడు అంటారు! భక్తుని యొక్క మనస్సే తన యొక్క ఇష్టదైవం యొక్క ఆకారాన్ని (సాక్షాత్ - ఆకారాన్ని) ధరించి భక్తుని యెదుట ప్రత్యక్షం అవుతుంది అని "సాక్షాత్కారము" అనే మాటకు వివరణ చెబుతారు భగవాన్ బాబా!

Birds of the same feather, flock together (ఒకే రంగు పక్షులన్నీ ఒకచోట చేరుకుంటాయి) అంటారు! సారూప్యమైన ఆలోచనలూ, భావాలూ, లక్ష్యాలూ, సాధనలూ కలిగిన వ్యక్తులు ఒకటిగా కలసిపోతూ ఉంటారు! అంతే కాదు! ఒకే కాలంలో బ్రతుకుతూ ఉండే మానవుల ఆలోచనలు సారూప్యమైన భావాలు కలిగిన శక్తివంతమైన మనస్సుగల వారి ఆలోచనలచేత ప్రభావితం అవుతూ ఉంటాయి. "Ancient Wisdom" అనే మహాగ్రంథంలో మేడం బ్లావట్స్కీ ఈ మనస్తత్త్వ సంబంధమైన ధర్మాన్ని ఎంతో అద్భుతంగా వివరించారు! ప్రతి మనిషి యొక్క మనస్సూ రేడియో తరంగాలను ప్రసారం చేస్తూ వాటిని

సేకరించుతూ ఉంటే "రేడియో సెట్టు" లాగా పనిచేస్తుంది. ఒక మంచి ఆలోచనకు మన మనస్సులలో మనం చోటు కల్పించితే, దాన్ని ఎంతో గొప్పగా ప్రభావపరచే ఆలోచనా తరంగాలు వాతావరణంలో (Spaceలో) ఎక్కడి నుంచో వచ్చి మనపై ప్రసరించి మన మనస్సులను ప్రభావపరుస్తాయి! అదేరీతిగా ఒక దుష్టమైన ఆలోచనకు మనమనస్సులో చోటు కల్పించితే, ఎన్నో దుష్టసంకల్పాల దుష్ప్రభావం మన మనస్సులపై వచ్చి పడుతుంది! 'సారూప్యత'లోగల విశేషమైన శక్తి ఇది! మనకు తెలిసినా తెలియకపోయినా శక్తివంతంగా పనిచేసే మనుజుల మనస్సులలోకి 'టెలీపతి' 'సైకోకైనసిస్' (దూరంగా ఉన్నవారి మనస్సులలోకి మన ఆలోచనలను పంపటం, వారి మనస్సులలో గల ఆలోచనలను మనం తెలుసుకోవటాన్ని, 'టెలీపతి' అంటారు. ఇతరుల ఆలోచనల తీరును కూడా ప్రభావపరచేరీతిగా మన యొక్క మనస్సు నుంచి ఒక శక్తివంతమైన భావప్రేరణను ప్రసరింపజేయడాన్ని 'సైకోకైనసిస్' అంటారు.) అనే శక్తులు సహజంగానే ఉంటాయి. వాటిని సాధనద్వారా, కృషి ద్వారా అనుభవించ గలిగినవారు ఎందరో గతంలో ఉన్నారు, ఇప్పుడూ ఉంటున్నారు, ఇక ముందూ ఉంటారు! ఆలోచనల్లో సారూప్యతను ఏర్పరచుకోవటం, లక్ష్యవస్తువుతో సారూప్యతను ఏర్పరచుకోవటం 'సారూప్యముక్తి' లక్షణాలు.

*"మోక్షము ఒక ప్రత్యేకమైన స్థానముకాదు; తన స్వరూపాన్ని తాను గుర్తించటమే మోక్షము" తనను తాను గుర్తించడమే మోక్షము అంటారు భగవాన్ బాబా.*

*(వేదవాణి పేజీ 222)*

**సాయుజ్య ముక్తి :-** 'సాయుజ్యం' అంటే లక్ష్యవస్తువుతో కలిసిపోవటం. తన నిజతత్త్వంతో తాను పరిపూర్ణంగా కలిసిపోవటాన్ని ముక్తి యొక్క విశిష్టమైన అనుభవంగా మహనీయుల చరిత్రలు నిరూపించాయి! నీరు నీరులో కలిసినట్లు, పాలుపాలలో కలిసినట్లు ఈ కలయికతో తాను, తన తత్త్వము ఏకమై ఉంటాయి! దీన్నే " Unity of Personality" అని ఆధునికంగా వ్యాఖ్యానించవచ్చు. మనిషిలో ఈనాడు, ఏనాడు కూడా అనైక్యత ప్రధానంగా చోటుచేసుకొని ఉంటుంది. ఆలోచనలు వేరు, మాటలు వేరు, చేతలు వేరు, ఒకచోట ఒక తీరు, మరొక చోట మరొక తీరుగా ప్రవర్తిస్తూ ఉండటం సహజమై పోయింది. అలా ఉండకపోతే బ్రతకటం కష్టం అనే రోజులు కూడా వచ్చాయి. కానీ అది చాలా పొరపాటు ఆలోచన అని చివరకు ప్రతి మనిషికీ అతని అనుభవమే ఒక గుణపాఠం నేర్పుతుంది. విచ్ఛిన్నమైన వ్యక్తిత్వం (Split Personality) బలహీనమైన మనస్సు యొక్క లక్షణం. శక్తివంతమైన మనస్సు ఇలా విచ్ఛిత్తిని పొందదు. ఏ చోటనైనా, ఏ కాలంలోనైనా, ఎవరి దగ్గరనైనా సరే వ్యక్తిత్వం విడిపోకుండా ఉండటమే పూర్ణమైన వ్యక్తిత్వం యొక్క లక్షణం. తన నిజతత్త్వంతో తన నిజ స్వరూపంతో తాను ఎప్పుడూ ఒక్కటిగా ఉండటం 'సాయుజ్యం' అనే వ్యక్తి యొక్క లక్షణం. ఇదే ఆధ్యాత్మిక జీవితం యొక్క సాఫల్యానికి ఒక లక్ష్యం అని చెప్పవచ్చు. ఈ లక్ష్యం లౌకిక జీవితంలో కూడా, ఎంతో ప్రాముఖ్యత వహించాలి. లౌకిక స్థాయిలో కూడా "నేను నేనుగా ఉంటాను" అనే భావనను ఆధునిక తత్త్వవేత్తలంతా సమర్థిస్తారు.

'నీవు నీవుగా ఉండటాన్ని ఈ క్షణం నుంచీ ప్రారంభించు. అలా ఉండటానికి ప్రయత్నించు. ఒక గుడ్డలషాపులోకి వెళ్ళినా, ఒక రెస్టారెంటుకు వెళ్ళినా, ఏ సంస్థలో నీవు అడుగుపెట్టబోతున్నాకూడా, నీవు నీవుగా ఉండటానికే అలా ఉండటానికి ప్రయత్నించు. ఇతరులతో మాట్లాడేటప్పుడు, ఇతరులతో నీకు గల సంబంధాలలోనూ, ఇతరులతో కలిసి ఫలితాలు పంచుకొనే ప్రతి పనిలోనూ నీవు నీవుగానే ఉండటానికి ప్రయత్నించు. కానీ మనం సాధారణంగా అందుకు భిన్నంగా ప్రవర్తిస్తుంటాము. మన అశ్రద్ధే అందుకు కారణం. నీవు నీవుగా ఉండటం అనేది ఇతరులచేత తప్పకుండా అభినందించబడే విషయమని నీవు గుర్తుంచుకోవాలి. అలాగే నీవూ ఇతరులయొక్క స్థితిని, హక్కులను గుర్తించి, అంగీకరించి గౌరవించు", అంటారు శ్రీ నెపోలియన్ హిల్.

" One cannot carry others along the highway of Success, but one may point the way by helping others help themselves"

"Never interfere with possession of him-self." అంటారు శ్రీ నెపోలియన్ హిల్.

"తన నిజతత్త్వంతో తాను కలిసిపోవటం అంటే ఏమిటి?" అనే ప్రశ్నకు ఎన్నెన్నో మతాల ద్వారా ఎందరెందరో మహనీయులు అనేకమైన రీతుల్లో సమాధానాలు చెబుతూ వచ్చారు. వాటిని గూర్చి వినటం, వివేక జ్ఞానంతో తెలుసుకోవటం ఒక యెత్తు. వాటిని ప్రత్యక్షంగా అనుభవించటం ఒక యెత్తు.

మన నిజతత్త్వం మనయొక్క మనస్సుయొక్క తత్త్వానికి కూడా భిన్నమయినది. అయితే మన నిజతత్త్వ విచారణలో మనకు సహకరించేది మన మనస్సే. అందుకోసం మనస్సుకు తగిన రీతిగా రక్షణ నివ్వాలి.

"మనస్సును మంచి అభ్యాసములందు ప్రవేశింప చేయటానికి తగినటువంటి కృషి సల్పటము సాధకుని యొక్క కర్తవ్యం. కొన్ని ఉద్రేకములు సంభవించినప్పటికీ, ప్రశాంతి ప్రాప్తించటానికి మనము రెండింటి యందు కూడాను మనస్తత్త్వాన్ని చక్కగా విచారించుకుంటూ మనస్సు యొక్క చేష్టలను గుర్తించుకుంటూ పోవటము చాలా అవసరము. మనస్సును నీవు అనుసరించుకోకుండా, మనస్సుకు నీవు సాక్షీభూతుడవుగా, నిల్పటము అత్యవసరము. నీవు మనస్సు నుంచి వచ్చినవాడవుకావు. నీ నుండి మనస్సు వచ్చినది. కనుక నీవు మనస్సుకు అధికారివిగానీ, నీకు మనస్సు అధికారి కాదు. కనుక అట్టి సర్వెంటుగా, అనగా నౌకరుగా, సాక్షిగా ఉన్న మనస్సుకు మనము లోబడి పోవటము ఇది నిజముగా మన యొక్క మానవత్వానికి తగినటువంటిదికాదు. మనస్సుకు మనము బానిసలు కాకూడదు. మనకు మనస్సు బానిసకావాలి"

"జీవన్ముక్తి అనగా ఏమిటి? జీవించి కూడను మనము ఈ మనస్సును వేరుపరచటంచేత, మనస్సుకు కొంత దూరం కావటంచేత మనము ముక్తులుగా బయలుదేరుతున్నాము; అనగా జీవించికూడను ఆత్మానందమును అనుభవించుకోవటమే, మనస్సు యొక్క ప్రతిబంధకములను లేకుండా చేసుకోవటమే జీవన్ముక్తి"

"ఇట్టి కృత్రిమమైన మనస్తత్త్వాన్ని, చంచలమైన మనస్తత్త్వాన్ని, చమత్కారమైన మనస్తత్త్వాన్ని క్రమక్రమేణా చక్కగా విచారణ ద్వారా తెలుసుకోవటంచేత మానవుడు తన యొక్క మానవత్వాన్ని తెలుసుకోవటంలో తగినకృషి చేసినవాడవుతాడు" - అంటారు భగవాన్ శ్రీ సత్యసాయిబాబా తమ "మనస్సు - మర్మము" గ్రంధములో.

*(సూచన :- ఇంతవరకూ మనస్సు యొక్క స్వభావాన్ని గూర్చి వీలైనంత లౌకికంగా, సహేతుకంగా అనేకమైన రీతుల్లో విచారణ చేయటం జరిగింది. ఇది 'మనిషి - మనస్సు' రచనలోని మొదటి భాగం. రెండవ భాగంలో వివిధమైన ఆధ్యాత్మిక సాధనల ద్వారా మనస్సు ఏరీతిగా వికాసాన్ని పొందుతుందో, చివరకు మనస్సు తనకు మూలమైన దివ్యాత్మతత్త్వంలో ఎలా లీనం అవుతుందో వివరించటానికి సరళమైన ప్రయత్నం జరుగుతుంది.)*

మాతృవాత్సల్య మే। మహిమా స్రవంతియై
సాయీ స్వరూపాన। సాగివచ్చె
పితృతత్వమొసగు సర్వేశ్వరాకా . మే
పర్తీశుమహిమల। ప్రాభవంబు
లోక శోకముబాప। లోకేశ్వరుడె నేడు
జనుల జాగృతి పెంచు। స్వామియయ్యె
నిత్యమంగళకీర్తి। సత్యసాయిమూర్తి
ఉన్నత స్ఫూర్తిమహోద్యమంబు

విశ్వమందునాల్గుదెసల। విస్తరించె
దివ్యమైన ప్రేమజ్యోతి। తేజమగుచు
అట్టి మాధవుడగు సాయినాశ్రయించి
మేలు పొందగరండోయి। మిత్రులారా!

- పంచాంగము శీనప్పశాస్త్రి

ఆర్.ఎస్.కె. స్మారక వ్యాసరచన పోటీలలో తృతీయ బహుమతి పొందిన వ్యాసం

# యువత - దేశభక్తి

"దేశమును ప్రేమించుమన్నా, మంచి అన్నది పెంచుమన్నా, దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్"

అన్న గురజాడవారి గేయాన్ని వినని ఆంధ్రుడు ఉండడంటే అతిశయోక్తికాదేమో! మనకు ఒక సామెత ఉంది. అదేమంటే "జన్మనిచ్చిన తల్లి, జన్మనిచ్చిన భూమి స్వర్గంకంటే గొప్పవి" అని. కాబట్టి ఈ దేశంలో ఉండే ప్రతి పౌరుడు కూడా దేశాన్ని ప్రేమించటం, గౌరవించటం అనేవి వారి మొట్టమొదటి అదృష్టంగా భావించాలి. మనం దేశాన్ని ప్రేమిస్తున్నామంటే దాని అర్థం ఏమంటే మన శాయశక్తులా దేశానికి సేవ చేయటం, తద్వారా దేశాభివృద్ధికి పాటుపడటం. "నిజమైన దేశ భక్తుడు లేదా భక్తురాలు తమ దేశానికి సేవచేసేందుకు ఎల్లవేళలా సిద్ధంగానే ఉంటారు."

దురదృష్టవశాత్తూ నేటి యువత కొన్ని వక్రమార్గాలను అనుసరిస్తోంది. వివిధరకాలైన వ్యసనాలకు లోనై "దేశాన్ని ప్రేమించటం" అనే పదానికి కూడా "వక్రభాష్యాలను" చెప్పే స్థితిలో ఉన్నారు. ఇది చాలా విచారించదగ్గ విషయం. ఈ వ్యసనాలు కేవలం "తాత్కాలికమై"నవేనని వారు గుర్తించక "శాశ్వతమైన" "దేశభక్తి"ని అలవరుచుకోలేకపోతున్నారు. ఇటువంటి వారు ఒకసారి వారి జాతి (దేశ) చరిత్రను పఠించాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

ప్రపంచ చరిత్రలో ఎంతోమంది దేశభక్తులు తమ దేశభక్తి ఏవిధంగా ప్రదర్శించారో ఒకసారి పరిశీలించి చూస్తే ఉదాహరణకు "ఫ్రాన్సు దేశంలో జోన్ ఆఫ్ ఆర్క్" తన దేశానికి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను తెచ్చేందుకు తన జీవితాన్ని సైతం అర్పించిన "మహావ్యక్తి". అదే విధంగా " అమెరికా స్వాతంత్ర్యాన్ని" సాధించేందుకు అమితమైన దేశభక్తిని ప్రదర్శించిన మహామనిషి "జార్జ్ వాషింగ్‌టన్". అంతెందుకు మన " భారతమాత" దాస్య శృంఖలాలను తెంచివేసే ప్రయత్నంలో "స్వరాజ్యం నాజన్మ హక్కు" అని దేశానికి చాటిన 'బాల గంగాధర్ తిలక్', "నా శరీరంపై పడిన ఒక్కొక్క లాఠీ దెబ్బ, బ్రిటీష్ ప్రభుత్వ శవపేటికకు

అబ్బరాజు వెంకట హనుమత్ ప్రసాద్

కొట్టబడే ఆఖరి మేకు" అని చాటిన 'లాలాలజపతిరాయ్' 'సుభాష్ చంద్రబోసు', జాతిపిత 'మహాత్మా గాంధీజీ' "ఏదిరా కాల్చు !" అని బ్రిటీష్ ప్రభుత్వాన్ని గడగడలాడించిన "ఆంధ్ర కేసరి ప్రకాశం వంటి నాయకులు", భగత్ సింగ్, ఆజాద్, రాజ్‌గురు, అల్లూరి సీతారామరాజు వంటి యువనాయకులు కూడా ఎంతో మంది ఉన్నారు. వారు తమ జీవిత కుసుమాలను "భరతమాత పాదాలవద్ద ఆనందంగా అర్పించారు." మహాత్మా గాంధీజి, నెహ్రూ కూడా యువతకు కావలసిన దేశభక్తిని గురించే పేర్కొనటం జరిగింది.

"Young Generation is the foundation of the Country" అని పేర్కొనటం జరిగింది.

"దేశభక్తి ఏరకంగా అలవడుతుందో, అభివృద్ధి చెందుతుందో ప్రత్యేకించి పేర్కొనాల్సి ఉంది. దేనికైనా ముఖ్యమైనది విద్య. "విద్యలేనివాడు వింత పశువు" అనే సామెత కూడా ఉంది. ఈ విద్య వలన దేశపరిస్థితులు, ఎదుర్కొంటున్న సమస్యలు ఒక అవగాహనకు వచ్చి తద్వారా వారు వివిధ రకాలైన పద్ధతుల ద్వారా దేశభక్తి ఆవశ్యకతను వివరించటం జరుగుతుంది. ప్రపంచంలో ఏ దేశ చరిత్రను పరిశీలించినా ఆ దేశ ప్రజలలో దేశభక్తిని పెంపొందించటంలో ముఖ్యపాత్ర పోషించినవి గ్రంధాలు, పత్రికలే. రష్యాలో కాల్‌మార్క్స్ "దాస్‌కాపిటల్, కమ్యూనిస్ట్ మానిఫెస్టో" వంటి గ్రంధాలను రచించి పౌరులను దేశభక్తి

ప్రపూరితులు గావించాడు. అదేవిధంగా మనదేశంలో "జవహర్‌లాల్ నెహ్రూ", "డిస్కవరి ఆఫ్ ఇండియా" మొదలైన గ్రంధాల ద్వారానూ, స్వరాజ్య, ఆంధ్రపత్రిక, హిందూ పత్రిక మొదలైన పత్రికలు కూడా పౌరులను దేశభక్తులుగా తయారుచేసాయి.

ఈ రకమైన "విద్య"వలన "విజ్ఞానం" పెంపొందుతుంది. ప్రపంచ మేధావులుగా గుర్తింపబడ్డ వారిలో యువతే ప్రధానపాత్ర వహించింది అనటంలో అతిశయోక్తి లేదు. "సర్ సి.వి. రామన్, యల్లాప్రగడ, ఐన్‌స్టీన్, న్యూటన్, మేడం క్యూరీ" వంటివారు యువకులుగా ఉండగానే పేరు ప్రఖ్యాతులనార్జించారు. వారు కనుగొన్న విషయాలు వారి దేశానికీ, తద్వారా ప్రపంచానికి ఎంతగానో ఉపయోగపడుతున్నాయి. Duty is God. మనం చేసే పనే వ్యక్తిత్వాన్ని చూపిస్తుంది.

వీటన్నిటికంటే ముఖ్యమైనవి "క్రమశిక్షణ, సత్ప్రవర్తన, సచ్ఛీలం". "క్రమశిక్షణ లేని జీవితం డ్రైవరు లేని బండి వంటిద"ని భగవాన్ శ్రీ సత్యసాయిబాబా ఉపదేశించారు." మహాత్మాగాంధీ మనకు స్వాతంత్ర్యం తీసుకుని రావటానికి ముఖ్యకారణం ఆయనకు క్రమశిక్షణ, నియమబద్ధజీవనం, సత్ప్రవర్తన, సచ్ఛీలం ఆయనకుండటమే. అయితే ఒక్క క్రమశిక్షణ సత్ప్రవర్తన, సచ్ఛీలం ఏకాగ్రత లేకపోతే సాధించగలిగింది ఏదీలేదు. దీనికి ప్రపంచ చరిత్రలో అనేక ఉదాహరణలున్నాయి. "జర్మనీ నియంత అయిన హిట్లరు" ఎంతో క్రమశిక్షణ కల వ్యక్తి అయినప్పటికీ రెండవ ప్రపంచ యుద్ధంలో ఓడిపోయి చివరకు "ఆత్మహత్య చేసికొనే దుస్థితిని కల్పించు కోవటానికి గల కారణం ఆయనలో సత్ప్రవర్తన, సచ్ఛీలం, లోపించటమే. అలాగే జపానును ఉదాహరణగా చెప్పుకుంటే రెండవ ప్రపంచ యుద్ధంలో సర్వనాశనమై పోయికూడా ఈనాడు ఎలక్ట్రానిక్ ఉపకరణ రంగంలో కేవలం 20 సంవత్సరాలలోనే ప్రపంచాన్ని శాసించే స్థితికి చేరుకోవటానికిగల కారణం అక్కడి ప్రజలలో తమ దేశంపై అమితమైన దేశభక్తి, సత్ప్రవర్తన, సచ్ఛీలం కలిగి ఉండటమే.

**ముగింపు :** ఈనాటి ప్రజలు ముఖ్యంగా యువత క్రమశిక్షణ, దేశభక్తి యొక్క అవసరాన్ని గుర్తించాలి. అందుకే "స్వామి వివేకానంద" యువతకు Arise, Awake, Don't stop till the goal is reached.అనే సందేశాన్నిచ్చారు. అదే విధంగా మౌర్య సామ్రాజ్య స్థాపనకు కారకుడైన "చాణక్యుడు" కూడా ఆనాటి కాలంలోనే దేశభక్తి యొక్క ఆవశ్యకతను గురించి "దేశభక్తి"లేని వ్యక్తికి మరణశిక్ష కూడా వ్యర్థం అన్నాడు. అదే విధంగా దేశభక్తిని గురించి చెప్తూ పాశ్చాత్యకవి అయిన 'సర్‌వాల్టర్ స్కాట్' ఈ విధంగా చెప్పాడు.

" Breathes there the man with soal so dead, who never to himself hath said,; This is my own native Land" అన్నాడు.

అదే విధంగా దేశభక్తిలేని వారి గురించి చెప్తూ "To the vial dust to the where he spring; unwept, unhonour'd, and unsung" అన్నాడు. కాబట్టి ప్రతి ఒక్కరూ "దేశభక్తి"ని అలవర్చుకొని దేశసేవ ద్వారా తమ జీవితాలను సార్థకం చేసుకోవాలి.


## వధువు కావలెను.

ఆరువేలనియోగి, కౌండిన్యస, 26సం॥లు 6' ఎత్తు, శ్రవణ - రియాద్ (సౌదీ అరేబియా)లో నెలకు రూ॥60,000 జీతంతో సిస్టమ్స్ ఎనలసిస్ట్‌గ పనిచేస్తూ త్వరలో U.S.A. వెళ్ళనున్న యువకునకు 5 ' 5' ఎత్తు, M.C.A, M.B.A, B.Sc. (Comp.), B.Tech, చేసిన అందమైన అమ్మాయి కావలెను. సత్యసాయి విద్యాసంస్థలలో చదివిన వారికి ప్రాధాన్యత యివ్వబడ్తుంది. శాఖ పట్టింపులేదు. ఫోటోతో సహా ఈ అడ్రస్‌కు సంప్రదించగలరు.

*టి. రామమూర్తి H No. 1-7-384,*
*రెవిన్యూ కాలనీ, సుబేదారి, హన్మకొండ.*
***Ph. 70912***

# ప్రత్యేకాంధ్ర రాష్ట్ర ఊహకు బి. ఎన్. శర్మ

మహాత్మాగాంధి దేశ రాజకీయాల్లోకి ప్రవేశించక ముందు ఆంధ్రదేశంలో. మితవాదులయిన మహానాయకులు ఉండేవారు. వీరు యిటు బ్రిటిష్ ప్రభుత్వానికి విశ్వాసపాత్రులుగా, గౌరవనీయులుగా ఉంటూనే అఖిల భారత కాంగ్రెస్ సంఘ నాయకులయి ప్రజల గౌరవాభిమానాలను చూరగొంటూ ఉండేవారు. విశాఖపట్టణానికి చెందిన బయ్యా నరసింహ శర్మ (బి.ఎన్ శర్మ), కాకినాడకు చెందిన గంజాం వెంకటరత్నం, రాజమండ్రికి చెందిన న్యాపతి సుబ్బారావు, ఏలూరుకు చెందిన మోచర్ల రామకృష్ణయ్య, బందరుకు చెందిన వేమవరపు రామదాసు గార్లు ఈ కోవకు చెందినవారే.

ఉమ్మడి మద్రాస్ రాష్ట్రంలో తెలుగువారు అభివృద్ధి సాధించజాలరని ప్రత్యేక తెలుగు రాష్ట్రం ఇందుకు అవసరమని గుర్తించి అందుకు ప్రయత్నించిన మొదట విడత తెలుగు నాయకులలో బయ్యా నరసింహ శర్మగారు ప్రముఖులు.

## ఆంధ్ర మహాసభ వ్యవస్థాపకుడు

1913 సంవత్సరములో బాపట్ల పట్టణంలో చారిత్రాత్మక ఆంధ్ర మహాసభ తొలి సమావేశం జరిగినప్పుడు దానికి అధ్యక్షత వహించిన ఘనత నరసింహ శర్మగారికి దక్కింది. ఆంధ్ర మహాసభ వ్యవస్థాపకులలో ఆయన ఒకరు. ఆంధ్ర రాష్ట్రోద్యమ సాధన ఉద్యమంలో తెలుగువారు వేసిన మొదట అడుగు ఆంధ్ర మహాసభ స్థాపన - అప్పటికి యువకుడైన రాయప్రోలు సుబ్బారావు గారు ఆ మహాసభలో గళం ఎత్తి "అమరావతీ పట్టణమున బౌద్ధులు విశ్వవిద్యాలయములను స్థాపించునాడు" అనే ప్రబోధగీతాన్ని ఆలాపించి సభికులను ఉర్రూత లూగించారు. 1917లో నెల్లూరులో ఆంధ్ర మహాసభ వార్షిక సమావేశం దేశభక్త కొండా వెంకటయ్యగారి అధ్యక్షతన జరిగింది. ఆ సమావేశంలో మొదటసారిగా ప్రత్యేకాంధ్ర రాష్ట్రాన్ని కోరుతూ బి.ఎన్. శర్మ సారధ్యంలో తీర్మానం ప్రవేశ పెట్టడం జరిగింది. ఆ సభలో కొందరు ముఖ్యంగా రాయలసీమకు చెందిన నాయకులు - ప్రత్యేకాంధ్ర రాష్ట్రంలో తమకు అన్యాయం జరుగుతుందన్న అభిప్రాయంతో దాన్ని వ్యతిరేకించినప్పుడు, వారి భావాలను తొలగించి ఈ తీర్మానం ఏకగ్రీవామోదం పొందేట్టు చేయగలిగిన చతురుడు శర్మగారు.

కంచి వాసుదేవరావు

శర్మగారు జన్మించింది విశాఖజిల్లా అనకాపల్లి సమీపంలోని తుమ్మపాలగ్రామం. గాంధీజీకన్నా వయసులో రెండు సంవత్సరాలు పెద్ద. రాజమండ్రి ఆర్ట్సు కాలేజీలో డిగ్రీ, మద్రాస్ లా కాలేజీలో లా పట్టాను సంపాదించి విశాఖపట్టణంలో ప్రాక్టీసు పెట్టారు. చిత్రమేమంటే ఆ కాలరాజకీయ నాయకులందరూ న్యాయవాదులే. విశాఖపట్టణంలో అనేక సంవత్సరాలు జయప్రదంగా ప్రాక్టీసు చేశారు.

మద్రాస్ లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యునిగా రెండు విడతలు నరసింహశర్మగారు పనిచేశారు. ఆయన జమీందారీ కుటుంబానికి చెందినవారు అయినా భూమి దున్నుకునే కౌల్దారుల శ్రేయస్సును దృష్టిలో పెట్టుకుని వారి రక్షణకు ఒక చట్టాన్ని శర్మగారు రూపొందించారు. 1914లో మద్రాస్ ప్రభుత్వ ప్రతినిధిగా బ్రిటన్ సందర్శించి అక్కడ పలు సమావేశాలలో భారతదేశం ఎదుర్కొంటున్న వివిధ సమస్యలను బ్రిటిష్ వారికి వివరించి వారి మన్ననలు పొందారు.

1916లో శర్మగారు ఇంపీరియల్ లెజిస్లేటివ్ కౌన్సిల్‌కు ఎన్నికయ్యారు. ఆ తర్వాత వైస్రాయి ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్ సభ్యులయ్యారు.

1917లో బ్రిటిష్ ప్రభుత్వ భారత కార్యదర్శి లార్డు మాంటేగ్ బ్రిటిష్ ఇండియాలో పాలనావరమైన

సంస్కరణలను పరిశీలించడానికి భారతదేశానికి వచ్చారు. అప్పుడు బి.ఎన్. శర్మ, న్యాపతి సుబ్బారావు, డా॥ పట్టాభి నాయకత్వంలో ఆంధ్ర ప్రతినిధి బృందం మాంటేగ్‌ను కలుసుకుని మద్రాస్ రాష్ట్రాన్ని విభజించి ప్రత్యేకాంధ్ర రాష్ట్రాన్ని ఏర్పాటు చేయవలసిందిగా అర్థించారు. ఈ అభ్యర్థనను మాంటేగ్ సానుభూతితోనే విన్నారు.

### ఇంపీరియల్ కౌన్సిల్‌లో ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర తీర్మానం

అక్కడితో శర్మగారు ఆగలేదు. 1918 ఫిబ్రవరి 6వ తేదీన ఢిల్లీలో ఇంపీరియల్ లెజిస్లేటివ్ కౌన్సిల్ సమావేశం అయినప్పుడు ప్రత్యేకాంధ్ర రాష్ట్ర తీర్మానాన్ని కోరుతూ ఒక తీర్మానాన్ని ప్రవేశపెట్టారు. సురేంద్రనాథ్ బెనర్జీ, వి.ఎస్. శ్రీనివాసశాస్త్రి ఈ ప్రతిపాదనకు అనుకూలంగా స్పందించారు. కాని భాష ఆధారంగా ఏర్పడ్డ రాష్ట్రాలు దేశ సమైక్యతకు భంగం అన్న అభిప్రాయంతో దృఢంగా వ్యతిరేకించారు. మొత్తం మీద ఇంపీరియల్ లెజిస్లేటివ్ కౌన్సిల్ ఆమోదాన్ని ఈ తీర్మానం పొంద లేకపోయింది. హోంరూల్ వ్యవస్థాపకురాలయిన అనీబిసెంటు కూడా భాషా ప్రయోక్త రాష్ట్ర సిద్ధాంతాన్ని తీవ్రంగా వ్యతిరేకించారు. ఆంధ్ర రాష్ట్ర సాధనకు చట్టపరంగా తీసుకున్న మొదటి చర్య ఈ తీర్మానం. ఐతే అఖిల భారత కాంగ్రెస్‌మటుకు భాషాప్రయోక్త రాష్ట్రాల ఏర్పాటును ఆది నుంచి సమర్థిస్తూనే ఉంది. బి.ఎన్. శర్మగారు చాలా సంవత్సరాలు ఎ.ఐ.సి.సి సభ్యునిగా ఉన్నారు. ఆయన కృషి వలన ప్రత్యేకాంధ్ర రాష్ట్ర సాధనలో తొలిమెట్టుగా ప్రత్యేకాంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సంఘం ఏర్పడింది.

బ్రిటిష్ సామ్రాజ్యంలో అంతర్భాగంగా స్వయం పాలన, ఆర్థిక అధికారాలను కలుగచేయాలని కోరుతూ శర్మగారు మరికొందరు కలిసి బ్రిటిష్ ప్రభుత్వానికి ఒక వినతి పత్రాన్ని సమర్పించారు. లెజిస్లేటివ్ కౌన్సిళ్ళను స్వయంపాలనకు సంబంధించి ఇవ్వవలసిన అధికారాలను ఈ వినతి పత్రం సూచించింది. 1916లో లక్నోలో కాంగ్రెస్ ముస్లింలీగ్‌లో మధ్య కుదిరిన ఒప్పందానికి ఈ వినతి పత్రం ప్రాతిపదిక అయింది. ఈ సిఫార్సులకు అనుకూలంగా మాంటేగ్ ఛెమ్స్ ఫర్డ్ సంస్కరణలు ఉండగలవని శర్మగారు తదితర మితవాద నాయకులు ఆశించారు. కాని అతి క్రూరమైన రౌలట్ చట్టాన్ని మాంటేగ్ ఛెమ్స్ ఫర్డ్ సిఫార్సు చేసి భారత స్వాతంత్ర్యోద్యమం తీవ్రరూపం దాల్చడానికి పరోక్షంగా దోహదపడ్డారు. రౌలట్ చట్టం అతి క్రూరమైనదని శర్మగారు కూడా భావించారు. దాన్ని తీవ్రంగా ఖండించారు.

భారతదేశానికి ఒక జండా ఉండాలని శర్మగారు భావించేవారు. భారత జాతీయపతాక రూపకర్త పింగళి వెంకయ్యగారు. భారతదేశానికి జాతీయ పతాక ఆవశ్యకత గురించి ఒక పుస్తకం రాసినప్పుడు దానికి విలువైన ముందు మాటను శర్మగారు వ్రాశారు.

### ఆంధ్ర విశ్వవిద్యాలయానికి స్థలదానం

ఆయన అనేక సంవత్సరాలు విశాఖపట్టణ మున్సిపల్ ఛైర్మన్‌గా పనిచేశారు. ఆయన వదాన్యులు. శైశవావస్థలో ఉన్న ఆంధ్ర విశ్వవిద్యాలయానికి విశాఖపట్టణం లోని తన భూములలో కొంత భాగాన్ని దానం చేశారు. ఆ భూమి మీదనే ఇప్పటి ఆంధ్ర విశ్వవిద్యాలయ మహిళా హాస్టలును నిర్మించారు. విశాఖపట్టణం మున్సిపాలిటీకి కూడా కొన్ని దానాలు చేశారు.

1952లో శర్మగారు మరణించారు. ఆయనకు ఎన్ని వ్యాపకాలు ఉన్నా తెలుగుప్రజల సర్వతోముఖ ప్రగతి ఆయన ప్రధాన లక్ష్యంగా నిలిచింది. ఆంధ్ర మహాసభ అధ్యక్షునిగా, ఇంపీరియల్ కౌన్సిల్ సభ్యునిగా, ఆంధ్ర రాష్ట్ర సాధనకు తనవంతు కృషి చేశారు. ఆయన మరికొన్ని సంవత్సరాలు జీవించే ఉంటే ప్రత్యేక రాష్ట్ర సాధనకు పొట్టి శ్రీరాములుగారి ఆత్మబలి అవసరమయి ఉండేది కాదేమో! ☆

## శ్రీవాణి జీవిత సభ్యులు



**Sri S. Dharmaiah,** B.Com., L.L.B.,
Magistrate, Hyderabad.

# విభ్రాంతి గొల్పే విశ్వవిశేషాలు

ప్రతి మనిషీ అతిపిన్న వయసు నుంచి ఆసక్తితో పరికించేవి ఆకసంలో మిలమిలమెరిసే తారలు. ఆకాశానికి నిచ్చెన వేసుకుని వెన్నముద్దలవంటి నక్షత్రాలను కోసుకోవాలని మనందరం ఉవ్విళ్ళూరిన వారమే! మహాత్ములు చనిపోయాక నక్షత్రాలుగా మారుతారని మన అమ్మమ్మలూ, నాయనమ్మలూ చెప్తుంటారు. ఇంతకీ ఈ తారల తీరులు ఏమిటి? అనంతకోటి తారలకు ఆలవాలమైన ఈ అనంత విశ్వం విశేషాలు విభ్రాంతి కలిగించేవిగా ఉంటాయి.

## విశ్వరూపం

సృష్టి రహస్యాలను ఛేదించాలంటే విశాల విశ్వపు తీరుతెన్నుల గురించి కొంతైనా తెలుసుకోవాలి. మనం నివసిస్తుండిన భూమి సూర్యుని చుట్టూ తిరిగే ఒక సామాన్య గ్రహం. ఇది కాక బుధ, శుక్ర, అంగారక, గురు, శని, యురేనస్, నెప్ట్యూన్, ప్లూటో అనే మరో ఎనిమిది గ్రహాలు సూర్యుని చుట్టూ పరిభ్రమిస్తున్నాయి. ఇవికాక అంగారకునికి, గురునికీ మధ్యనున్న కక్ష్యలు పరిభ్రమించే వేలాది అల్పగ్రహాలు (ఆస్టిరాయిడ్స్) ఉన్నాయి. ఇకపోతే చంద్రుడు మన భూమి చుట్టూ తిరిగే ఒక ఉపగ్రహం. ఇలాగే అంగారకునికి రెండు, గురునికి పదిహేడు, శనికి పదునాలుగు, యురేనస్‌కి తొమ్మిది, నెప్ట్యూన్‌కి రెండు, ప్లూటోకి ఒకటి ఉపగ్రహాలున్నాయి. ఇవన్నీ వాటి మాతృగ్రహాల చుట్టూ తిరుగుతూ, వాటితోపాటు సూర్యుని చుట్టూ పరిభ్రమిస్తున్నాయి. ఇదికాక లక్షల సంఖ్యలో ధూమకేతువులు (తోకచుక్కలు) కూడా సూర్యుని చుట్టూ పరిభ్రమిస్తున్నవే! ఇవన్నీ కలిసి "సౌర కుటుంబం" లేక "సౌరమండలం" అవుతుంది. ఈ కుటుంబానికి పెద్ద అయిన సూర్యుడు ఒక చిన్నపాటి నక్షత్రం మాత్రమే. సూర్యుని వంటివీ, అంతకు ఎన్నో రెట్లు పెద్దవీ అయిన కోటానుకోట్ల నక్షత్రాలు కలిసి "నక్షత్ర కూటాలు" అవుతాయి. వీటినే "గెలాక్సీలు" అంటారు. దట్టమైన చీకటి రాత్రిపూట తలఎత్తి నింగికేసి చూస్తే నడినెత్తిన రెండు పాయలుగా చీలిన మసక కాంతి ఈ చివర నుండి ఆ చివర వరకు కనిపిస్తుంది. దీనిని తెలుగులో 'పాలపుంత' అని, సంస్కృతంలో "ఆకాశ గంగ" అని, ఇంగ్లీషులో "మిల్కీవే" అని అంటారు. ఈ పాలపుంత ఒక బ్రహ్మాండమైన నక్షత్ర కూటమి. మన సౌరకుటుంబం ఈ కూటమికి చెందినదే. ఇటువంటి నక్షత్ర కూటాలు

**కె.ఆర్.కె.మోహన్**

ఈ అనంత విశ్వంలో కోటానుకోట్లు ఉన్నాయి. ఇటువంటి కోటానుకోట్ల నక్షత్ర కూటాలకు ఆవల అతి పల్చని ధూళి మేఘాలు ఉంటాయి. ఈ నక్షత్ర మేఘాలను 'నెబ్యులా' అంటారు. వీటినుంచే నక్షత్రాలు సకల విశ్వ పదార్థమూ సృజింపబడుతుంటాయి. విశ్వ ఆవిర్భావం గురించి విభిన్న సిద్ధాంతాలున్నాయి.

## అనంత విశ్వం

నూతిలోని కప్ప తన చుట్టూ ఉన్నదే లోకం అనుకుంటుందట. కప్ప సంగతేమో తెలియదుకాని మనుష్యులు మాత్రం గతంలో చాలాకాలం అలాగే భావించారు. ఎంతో మేధావులు, పురోగాములు అయిన భారతీయ శాస్త్రజ్ఞులు కూడా భూమి అనంత విశ్వానికి కేంద్ర బిందువనే సూర్యుడు, గ్రహాలు, నక్షత్రాలు అన్నీ భూమి చుట్టూ తిరుగుతున్నాయనీ భావించారు. పాశ్చాత్య దేశాలలో క్రీ.శ. 140వ సంవత్సరంలో క్లాడియస్ టోలెమీ అనే గ్రీకు శాస్త్రవేత్త భూమి కేంద్ర స్థానంలో ఉండి దాని చుట్టూ సూర్యుడు, గ్రహాలు తిరుగుతున్నాయని ప్రతిపాదించారు. ఇదే భావన కోపర్నికస్ కాలం వరకూ అంటే మరో పద్నాలుగు వందల సంవత్సరాలపాటు సాగింది. ఈయన క్రీ.శ. 1543వ సంవత్సరంలో భూమి కేంద్ర స్థానంలో లేదనీ, కేంద్రంలో ఉన్నది సూర్యుడనీ, దాని చుట్టూ గ్రహాలు తిరుగుతున్నాయనీ సాక్ష్యాధారాలతో నిరూపించాడు. వాస్తవం చెప్పినందుకు కోపర్నికస్‌ను మత ఛాందసులు సజీవదహనం చేశారు. అది వేరే సంగతి.

అయితే కోపర్నికస్ భావించినట్లు సూర్యుడు సౌరకుటుంబానికి కేంద్రంగా ఉన్నప్పటికీ ఈ అనంత విశ్వానికి మాత్రం కేంద్ర స్థానంలోలేడు. క్రీ.శ. 1805లో బ్రిటిష్ ఖగోళ శాస్త్రవేత్త సర్ విలియం హెర్ష్చల్ టెలిస్కోప్ (దూరదర్శని) ద్వారా జరిపిన పరిశోధనలవల్ల, మన సూర్యకుటుంబం పాలపుంత నక్షత్ర కూటమిలో ఒక అత్యల్ప భాగం మాత్రమేనని, ఈ నక్షత్ర కూటమిలో ఇంకెన్నో కోటానుకోట్ల నక్షత్రాలు సూర్యునివంటివీ, సూర్యుని కంటే అతి పెద్దవీ ఉన్నాయన్న విషయం విదితమయింది.

ఈ 20వ శతాబ్దంలో విశ్వానికి చెందిన అవగాహన అంతకంతకీ అధికం కాసాగింది. మన పాలపుంత నక్షత్ర కూటమిలో కనీసం వేయి కోట్ల నక్షత్రాలు ఉన్నాయని శాస్త్రవేత్తలు గుర్తించారు. 1925లో హబుల్ అనే అమెరికన్ శాస్త్రవేత్త ఈ అనంత విశ్వంలో పాలపుంత నక్షత్ర కూటమి వంటి గెలక్సీలు కోటానుకోట్లు ఉన్నాయన్న విషయం బహిర్గతం చేశాడు. అంతేకాదు, ఈయనే 1929వ సంవత్సరంలో ఈ నక్షత్ర కూటాలు ఒకదాని నుంచి మరొకటి అమితవేగంతో దూరంగా పోతున్నాయనీ, మనకి అత్యంత దూరంగా ఉన్న గెలక్సీలు, అత్యంత వేగంతో వెళ్ళిపోతున్నాయనీ నిరూపించాడు. ఉదాహరణకు మనకు ఐదుకోట్ల కాంతి సంవత్సరాల దూరంలో ఉన్న కన్యారాశిలోని నక్షత్ర కూటాలు సెకనుకి 750 మైళ్ళు వేగంతో పారిపోతుంటే మనకి 270 కోట్ల కాంతి సంవత్సరాల దూరంలో ఉన్న హైడ్రారాశికి చెందిన నక్షత్ర కూటాలు సెకనుకి 36000 మైళ్ళ వేగంతో పరుగు తీస్తున్నాయి. ఈ అనంత విశ్వంలో తారల మధ్య దూరాలు మామూలు మైళ్ళు, కిలోమీటర్లువంటి మానాలలో చెప్పలేనంత దూరంగా ఉంటాయి. అందువల్ల ఈ దూరాల్ని లెక్కకట్టడానికి ఒక కొత్త మానాన్ని రూపొందించారు. అదే కాంతి సంవత్సరం. కాంతి సెకనుకి 1,86,000 మైళ్ళ వేగంతో ప్రయాణిస్తుంది. ఇంతటి వేగంతో కాంతి ఒక సంవత్సరకాలంలో ప్రయాణించే దూరాన్ని "కాంతి సంవత్సరం" (లైట్ఇయర్) అంటారు. ఇది 588,00,000,00,00,000 మైళ్ళకు సమానం. ఉదాహరణకి మనకి అత్యంత సమీపంగా ఉన్న 'ఆల్ఫాసెంటారీ' నుంచి సెకనుకి 1,86,000 మైళ్ళ వేగంతో ప్రయాణించే కాంతి భూమిని చేరడానికి నాలుగు సంవత్సరాలు పడ్తుంది. అంటే అది నాలుగు కాంతి సంవత్సరాలు దూరంలో ఉందన్నమాట. హైడ్రా రాశినుంచి కాంతి రావడానికి 270 కోట్ల సంవత్సరాలు పడ్తుంది. ఈ మాసాలూ, లెక్కలూ చూస్తే ఉన్నమతి పోతుంది. ఈ లెక్కన ఈ విశ్వం ఎంత పెద్దదన్న ప్రశ్నవస్తుంది. అయితే ఈ ప్రశ్నకు ఖచ్చితమైన సమాధానంలేదు.

## భ్రూణహత్య

ఏరీ బంధువులేరీ
లేరీ శిశుహత్యసేయు లేకీ జనముల్
కారా కరుణ విహీనులు
మారే రోజులు కలిగెడు మార్గము లేదే

శాస్త్ర మెరిగి మనిషి శస్త్రచికిత్సతో
భ్రూణహత్య సేయ బూనినాడు
దనుజ వృత్తి బూని ధనము గడించుటీ
మార్గమనుచు మమత మరచినాడు

గర్భమందె నీకు గండమా! ఓ తల్లీ!
ఏమిపాపమమ్మయెంచి చూడ
పుట్టి మాత్రమీవు పొందు సుఖంబేమి?
పుట్టవద్దు తల్లి పుడమిమీద

శాపమేమి కలిగి పూపవై వచ్చావు
అడుగు వేయ క్రితమె అణగిపోవు
తల్లియెవ్వరమ్మ తండ్రియెవ్వరు నీకు?
కరుణ దయయులేని కఠినులమ్మ

తనువు దాల్చకుండ తప్పుకొనుము తల్లి
దనుజులుండుచోటు తగదురాగ
మనుజులుండు చోటు మరి కానరాదమ్మ
పొట్టలోనె నిన్ను పొడువగలరు

కరుణ లేని మాత కనికరించని తండ్రి
కడుపునేల నీవు కలుగవలయు
ఆడపిల్ల కలుగ ఆపదమెండంచు
మొలకలోనె నిన్ను మోదిజంపు

- గుడిసేవ నరసింహారావు

## విశ్వపరిమాణం

హబుల్ సిద్ధాంతం ప్రకారం విశ్వం అంతకంతకు విస్తరిస్తోంది. దూరంగా ఉన్న గెలక్సీలు అత్యధిక వేగంతో దూసుకుపోతున్న కారణంగా, ఒక స్థితిలో ఇది కాంతి వేగంతో ఇంచుమించు సమానమైన వేగంతో ప్రయాణిస్తుండవచ్చు. ఐన్‌స్టీన్ సిద్ధాంతం ప్రకారం ఏ పదార్థం కూడా కాంతివేగాన్ని అందుకోలేదు. ఒకవేళ అందుకోగలిగితే కాంతిగా మారిపోతుంది. ఈ సిద్ధాంతం ఆధారంగా ఐజాక్ అసిమోవ్ అనే శాస్త్రజ్ఞుడు విశ్వ పరిమాణాన్ని లెక్కకట్టాడు. 12.5 బిలియన్ కాంతి సంవత్సరాలు అంటే 1250 కోట్ల కాంతి సంవత్సరాల దూరంలో పదార్థం కాంతి వేగాన్ని అందుకుంటుంది. కనుక, విశ్వం ఒక అంచు ఇంతటి దూరంలో ఉందనీ, మరో అంచు కూడా అంతటి దూరంలోనే ఉంటుంది. కనుక విశ్వం వ్యాసం 2500 కోట్ల కాంతి సంవత్సరాలు అని తేల్చాడు. అంటే సెకనుకి 1,86,000 మైళ్ళ వేగంతో ప్రయాణించే కాంతికి విశ్వం ఒక అంచు నుంచి మరో అంచు చేరడానికి 2500 కోట్ల సంవత్సరాలు పడ్తుందన్న మాట. ఐన్‌స్టీన్ అంచనా ప్రకారం ఒక కాంతి కిరణం, ఒక బిందువు నుండి బయలుదేరి, సెకనుకి 1,86,000 మైళ్ళ వేగంతో ప్రయాణిస్తూ అనేక వంపులు తిరిగి, తిరిగి అదే బిందువులో చేరడానికి 20,000 కోట్ల సంవత్సరాలు పడ్తుంది. అంటే విశ్వం వ్యాసం సుమారు 6667 కాంతి సంవత్సరాలన్న మాట. ఇవన్నీ ఊహలే కాని వాస్తవం ఇప్పటికి తెలియదు. అనంతంగా భావించబడుతున్న విశ్వానికి ఎక్కడో-ఒకచోట ఒక హద్దంటూ ఏర్పరచాం కనుక 'ఆపైన ఏముంది?" అన్న ప్రశ్న వస్తుంది. ఆపైన అంతా శూన్యమేనా? శూన్యానికైనా హద్దంటూ ఉండాలి కదా! ఇటువంటి ప్రశ్నలు జిజ్ఞాసుల మస్తిష్కాలను మథిస్తాయి. ఈప్రశ్నలతో పాటు అసలు ఈ విశ్వం ఎలా ఆవిర్భవించిందన్న ప్రశ్న తలఎత్తుతుంది. ఈ విషయంలో కూడా విభిన్న సిద్ధాంతాలు ఉన్నాయి. ప్రతి సిద్ధాంతానికిఈ సాక్ష్యాలు, అధిక్షేపాలు రెండూ ఉన్నాయి. విశ్వం గురించిన అవగాహన పెరిగిన కొద్దీ, శాస్త్రీయ సత్యాలకు వైజ్ఞానిక వాస్తవాలకూ మరింత చేరువవుతాం. ■

# గోదావరిలో సాహసి

గోదావరిలో ఎదురీదుతూ ఒక వ్యక్తి కష్టము మీద ముందుకు వస్తున్నాడు. ఆ ప్రాంతంలో మొసళ్ళు ఉన్నాయని అంటారు. ఆ పడవ కళాసులు మేటిని విసరి అతనిని పడవ లోనికి చేర్చారు. ఆ పడవలో ముస్లిమ్ సైనికులు ఉన్నారు. వాళ్ళకి ఏవో కల్లబొల్లి కబుర్లు చెప్పి ఈ వచ్చిన బ్రాహ్మణుడు చలిజ్వరం వచ్చిందని వణకసాగాడు. అతను నమ్మబలికిన మాటలు నిజమనుకుని వాళ్ళు చలి తగ్గడం కోసం పడవ క్రింద భాగంలోని గదిలోనికి పంపారు. అక్కడ బంధింపబడిన ఒక రాజు ఉన్నాడు. ఎవరికి అనుమానం రాకుండా ఆ రాజుతో మాట్లాడి ఆరాజు వద్దనున్న రాజముద్రిక తీసుకుని బయటకు వచ్చాడు ఆ బ్రాహ్మణుడు. అంతలోనే తేలు కుట్టిందని కేకలు పెడుతూ వాళ్ళందరిని అల్లరి పెట్టసాగాడు. కడుపు ఉబ్బుతోంది. పవిత్రమైన గోదావరిలో మూత్ర విసర్జన చేయ్యలేను. మా అమ్మకోసం నేను తెస్తూవున్న మందు ఎక్కడో పోయింది. పడవ వెనక్కి తిప్పండి అనివాళ్ళని నానాగొడవ చేసి పడవ మీదనుండి గోదావరిలోకి గెంతేశాడు. ఆ రాజు సైనికులు వస్తే తాము చిక్కుతామనే భయంతో మరొక ఆలోచనలేని ఆ సైనికులు, వారి నాయకుడు పడవలపై ముందుకు సాగిపోయారు. ఆ తిక్కబ్రాహ్మణుడు గోదావరిలో చస్తాడు అనుకున్నారు.

ఆ రాజముద్రిక సంపాదించిన వ్యక్తి "విశ్వనాధుడు" అనేకవి. రాజుగారు బంధింపబడ్డారనే విషయం నిజమా, కాదా అని తెలుసుకునేందుకు ఇలాగ నటించి రాజముద్రిక సంపాదించాడు. ఆ రాజు ఓరుగల్లు నేలిన "ప్రతాపరుద్రుడు." ఆ తరువాత రాజును విడిపించడానికి ఇతను మంత్రి యుగంధరుడికి తోడ్పడ్డాడు కూడా!

మరి దేశం కోసం ప్రాణాలకు సైతం లెక్కచేయక మొసళ్ళున్న గోదావరిలో ఎదురీదిన విశ్వనాధునివంటి రాజభక్తులకు, దేశభక్తులకు నిలయం మనదేశం. నేడు మనకి ఇటువంటి దేశభక్తి, త్యాగబుద్ధి ఉన్నాయో లేదో ఎవరికివారే ఆలోచించుకోవాలి. అందరికి ఇటువంటి ప్రబోధాలు కావాలి! అప్పుడే సమైక్య భారతం వర్ధిల్లుతుంది.

- ఎన్.వి.ఆర్. సత్యనారాయణమూర్తి

# భగవాన్ సాయి మహిమలు

డా॥ రామకృష్ణారావు బహుభాషా కోవిదుడు, రాజకీయవేత్త. 1956వ సంవత్సరంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అవతరణ జరిగే వరకు ఆయన హైదరాబాద్ రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా ఉన్నారు. హైదరాబాద్ రాష్ట్రం ఆంధ్రలో విలీనమయి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అవతరణకు ఈయన ఎంతో కృషి చేశారు.

స్వామితో రామకృష్ణారావుగారికి 1955లోనే పరిచయమైంది. అనేక అనుభవాల ద్వారా వారి కుటుంబం అంతా స్వామి భక్తులయ్యారు.

ఆంధ్ర రాష్ట్రం ఏర్పడిన తర్వాత, భారత ప్రభుత్వం డా॥ రామకృష్ణారావుని మొదట కేరళ రాష్ట్రానికి, తర్వాత ఉత్తరప్రదేశ్ రాష్ట్రానికి గవర్నరుగా నియమించింది.

1961వ సంవత్సరంలో డా॥ రామకృష్ణారావు ఉత్తరప్రదేశ్ గవర్నర్‌గా ఉన్నప్పుడు ఆయన, ఆయన భార్య, బరైలి నగరాన్నుంచి నైనిటాల్‌కు ప్రభుత్వ పనిమీద రైలులో ప్రయాణిస్తున్నారు. వీరిద్దరికీ ఒక ఫస్టుక్లాస్ పెట్టె పూర్తిగా కేటాయించబడింది. ఆ పెట్టెలో సెక్రటరీలుగానీ, అంగరక్షకులుగానీ లేరు. మరో పెట్టెనుండి ఆ పెట్టెలోకి రావటానికి దారిలేదు.

రాత్రి గం॥ 11-00 సమయంలో రైలు చాలా వేగంగా పోతున్నప్పుడు, రైలు పెట్టెలోని ఫాను నుండి నిప్పురవ్వలు రావటం డా॥రామకృష్ణారావు గమనించారు. స్విచ్చి ఆపినా ఫాను తిరగటం ఆగలేదు. ఈ నిప్పురవ్వలు క్రమక్రమంగా పెద్దవౌతున్నాయి. ఆ పెట్టెలో రైలు ఆపటానికి గొలుసుగాని, మరే విధమైన పరికరంగానీ లేవు

మొదట నిబ్బరంగా ఉన్నా, నిప్పురవ్వల ఉధృతం ఎంత ఎక్కువైందంటే, ఆ పెట్టెకు త్వరలో నిప్పంటుకొని ఆ ఇద్దరూ సజీవదహనమౌతామని భయపడ్డారు.

అప్పుడు చేయగలిగింది దైవాన్ని ప్రార్థించటమే. ఆ దంపతులిద్దరూ దైవాన్ని ప్రార్థించారు. కొన్ని నిమిషాల తర్వాత పెద్ద తలుపుని ఎవరో గట్టిగా కొడుతున్న శబ్దమైంది. వేగంగా వెళుతున్న రైలుపెట్టె తలుపు దగ్గరకు ఈ అర్ధరాత్రి ఎవరు వచ్చారా అని ఆశ్చర్యపోతూ డా॥కృష్ణారావు తలుపు తీసారు. కాకీ దుస్తులు వేసుకున్న యువకుడైన ఒక మెకానిక్ లోపలికి వచ్చి, ఎవరితోనూ ఏమీ మాట్లాడకుండా తన సంచిలో నుంచి పరికరాలు తీసుకొని 10 నిముషాల్లో ఫాను బాగుచేశాడు. నిప్పురవ్వలు రావడం ఆగిపోయాయి. రిపేరుపని పూర్తయ్యాక తలుపు దగ్గరకు వెళ్ళి నేలపై కూర్చుని, వాళ్ళిద్దర్ని పడుకోమని, తాను తర్వాతి స్టేషన్‌లో దిగిపోతానని చెప్పాడు. రామకృష్ణారావుగారి భార్యకి అనుమానం వచ్చింది. ప్రాణాలకు తెగించి అర్ధరాత్రి సమయంలో స్పీడుగా పోతున్న రైలు పెట్టెల బయట ప్రయాణం చేయటానికి సాహసించిన ఈ మెకానిక్ తప్పక దొంగ అయిఉంటాడని, తామిద్దరూ నిద్రపోగానే విలువైన వస్తువులు, ధనం దొంగతనం చేసి ఎక్కడో దిగిపోతాడని భావించింది. డా॥రామకృష్ణారావు అతనినేమి పట్టించుకోకుండా పుస్తకం చదవటంలో నిమగ్నమయ్యారు. రెండు నిముషాల తర్వాత ఆ మెకానిక్ వారి దగ్గరకు వచ్చి తను వెళ్ళిపోతున్నానని, తలుపు లోపల వేసుకోమని చెప్పాడు. స్పీడుగా పోతున్న రైలులో ఇంత చీకటిలో ఎక్కడకు పోతాడని ఆలోచిస్తుండగా ఆ యువకుడు తలుపు తీసుకొని బయటకు వెళ్ళిపోయాడు.

## డి. వెంకటేశ్వరరావు

డా॥ రామకృష్ణారావుకి ఆలోచించగా ఆశ్చర్యం వేసింది. ఆ మెకానిక్‌కి ఈ పెట్టెలో ఫాను చెడిపోయిందని ఎలా తెలిసింది, అతను స్పీడుగా పోతున్న రైలు ఎలా ఎక్కగలిగాడు. ఇప్పుడు ఎలా దిగిపోయాడని ఆలోచించి, వాటికి సమాధానం దొరక్కపోవటంతో నిద్రకు ఉపక్రమించారు.

ఇది జరిగిన నెలరోజులకి డా॥రామకృష్ణారావు ప్రభుత్వం పనిమీద విమానంలో కాన్పూరు నుండి వారణాసికి వెళ్ళాల్సి వచ్చింది. విమానంలో ఆయన భార్య, సెక్రటరీ, ఒకరిద్దరు సహాయకులు ఉన్నారు.

వారణాసి వచ్చిందిగానీ విమానం క్రిందకు దిగకుండా చాలాసేపు ఆకాశంలో విమానాశ్రయం చుట్టూ తిరుగుతూంది. డా॥రామకృష్ణారావు తన అనుచరుడి ద్వారా విషయమేమిటో పైలట్‌ని కనుక్కోమని పంపించగా, ఆ పైలట్ ఏమి చెప్పాడంటే, విమానం చక్రాలు పట్టుకుపోయాయని, అవి క్రిందకు దిగటంలేదని, విమానంలో పెట్రోలు అయిపోతూందని, అందుచేత విమానాన్ని ఏదైనా గడ్డివున్న ప్రదేశంలో దింపడానికి ప్రయత్నిస్తున్నామని, అలాదిగినప్పుడు చక్రాలులేని విమానానికి, నేలకి కలిగిన రాపిడి వల్ల విమానం అగ్ని ప్రమాదానికి గురిఅయ్యే అవకాశంఉందని తెలియ పరిచాడు.

విమానాశ్రయంలో ఫైరింజన్లని, అంబులెన్సులని సిద్ధం చేసారు. అనేకమంది పోలీసులను, డాక్టర్లను పిలిపించారు. విమానాన్ని ఈ అత్యవసర పరిస్థితులలో దించటానికి తన అనుమతి ఇచ్చేముందు, డా॥రామకృష్ణారావు స్వామిని మనసులో తలచుకొని తమని రక్షించమని ప్రార్థించారు.

డా॥రామకృష్ణారావుగారి సెక్రటరీ కూడ స్వామి భక్తుడే. స్వామి ఆయనకు ఒక ఉంగరం సృష్టించి యిచ్చారు. డా॥రామకృష్ణారావు ప్రార్థన చేస్తున్న సమయంలో విమాన పైలట్ ఆయన సెక్రటరీ చేతికున్న ఉంగరాన్ని చూశాడు. అంతకుముందే అది స్వామి ఇచ్చిన ఉంగరమని పైలట్‌కి తెలియటం వల్ల, సెక్రటరీని పిలిచి, విమానం చక్రాలు క్రిందకు దించటానికి ఉన్న మీటను ఉంగరం ఉన్న చేత్తో ఆఖరి ప్రయత్నంగా క్రిందకు నొక్కమని చెప్పాడు. విమానంలో ఉన్నవారి జీవితాలకు అవే ఆఖరి ఘడియలని భయపడుతున్న సెక్రటరీ, స్వామిని మనసులో తలుచుకొని ఆ మీట నొక్కాడు. అంతవరకూ క్రిందకు దిగకుండా మొరాయించిన చక్రాలు అతి సునాయాసంగా, ఎంతో తేలికగా క్రిందకు దిగిపోయాయి. విమానంలో ఉన్నవారందరూ ఒక్కసారి గట్టిగా ఊపిరిపీల్చుకున్నారు. పైలట్ క్షేమంగా విమానాన్ని క్రిందకు దించాడు.

స్వామి బెంగుళూరులో ఉన్నారని తెలుసుకొని రామకృష్ణారావుగారి భార్య స్వామికి ఫోన్ చేసింది. స్వామే ఆ ఫోన్‌కాల్ అందుకున్నారు. రామకృష్ణారావుగారి భార్య తమని విమాన ప్రమాదం నుండి కాపాడినందుకు కృతజ్ఞతలు తెల్పుతూ విమాన ప్రమాదం గురించి చెప్పటం ప్రారంభించింది. అప్పుడు స్వామి ఆమె మాటలకు అడ్డువచ్చి, ఆ విమానానికి ఏమి జరిగిందో, ఎవరు ఎలా భయపడ్డారో, రామకృష్ణారావు ఏమని ప్రార్థించారో, అప్పుడు స్వామి విమానం చక్రాలు క్రిందకు దిగేలా ఎలా చేశారో వివరంగా చెప్పారు. రామకృష్ణారావుగారి భార్య ఆశ్చర్యం నుండి తేరుకోకమునుపే స్వామి ఆమెను "రైలులో జరిగిన సంఘటన గురించి ఏమీ మాట్లాడలేదు. ఈ సంఘటన జ్ఞాపకముందా?" అని అడిగారు.

ఆమెకు ఆ సంఘటన గుర్తురాలేదు. అప్పుడు స్వామి "రైలులో ఫాను నిప్పులు చిమ్ముతుంటే నేను వచ్చి రిపేరు చేస్తే నన్ను దొంగ అనుకున్నావుగదా?" అని అడిగారు. అప్పుడు ఆమెకు ఆ సంఘటన జ్ఞాపకం వచ్చి స్వామిని క్షమాపణలు అడిగి, కృతజ్ఞతలు తెలియజేసుకుంది. స్వామి పెద్దగా నవ్వి ఫోను పెట్టేశారు.

డా॥ రామకృష్ణారావు దంపతులకు స్వామి ఇటువంటి అనుభవాలు చాలా కలిగించారు. 1967వ సం॥లో రామకృష్ణారావు జబ్బుపడి ఆఖరి ఘడియల్లో మంచంలో ఉన్నప్పుడు స్వామి హోవర్డుమ్రెట్, మరికొంత మంది భక్తులతో కలసి హైదరాబాదులోని ఆయన ఇంటికివెళ్ళి దర్శనమిచ్చి, తన బొటన వేలిద్వారా గంగాజలాన్ని ఆయన నోటిలోపోసి ఆయన ఆత్మకు శాంతిని చేకూర్చారు.

*


## శ్రీవాణి పోషకులు



శ్రీ యస్.వి. సోమ సుందరరావు

డి.సి.టి.ఓ.

కాకినాడ

మనోభిరామం - 27

# జీవిత పరమార్ధము

సర్వేశ్వరుని సృష్టిలో నిరర్ధకమైనదేదీ లేదు. సమస్త జన్మలందు, మానవ జన్మ మహోత్కృష్టమైనది. ఎన్నో జన్మల పుణ్యకర్మల ఫలమే మానవజన్మకు మూలము. మరు జన్మలో మరల మానవ జన్మ మనకు లభించునో లేదో మనకు తెలియదు. అందువలన, మనకు లభించిన అపూర్వావకాశమే ఈ మానవజన్మ. ప్రతి మనిషి ఈ సత్యాన్ని గుర్తించుకోవాలి. ఈ లోకంలోని ప్రతి మనిషికి ఒక ప్రత్యేక ప్రయోజనము నిర్దేశించబడే ఉంటుంది. సమాజానికుపకరించనిచో ఆ ప్రయోజనం నిష్ప్రయోజనం. ఆ జీవితం నిరర్ధకం. మనిషి తన కోసం తాను బ్రతకడమే పరమార్ధం కాదు. తన బ్రతుకును సమాజశ్రేయస్సుకు ఉపకరించే రీతిలో మలచుకోవడంలోనే మనిషి జీవితానికి సార్ధకత లభిస్తుంది. భగవత్ప్రసాదితమైన సంపద కలిగినంత మాత్రాన మనిషి గొప్పవాడు కానేరడు. ఆ సంపదను సంతోషపూర్వకంగా పదిమందిలో కలిసి పంచుకొని ఆనందించగలవాడే అత్యుత్తమ సంపన్నుడు. మహాత్ముల జీవితాలను పరికించి చూస్తే మనకు గోచరించేది ఈ విషయమే! వారంతా తమకోసమే కాకుండ, తమ చుట్టూ ఉండే మానవ శ్రేయస్సు కోసం తపించి, శ్రమించి కాలం వెళ్ళబుచ్చారు. నేటి మానవుడు తాను ధర్మపధాన పయనిస్తున్నాడో, లేదో స్వయముగ తెలిసికోలేకున్నాడు. ఇతరులు తెలియచేస్తేగాని, అతనికావిషయం అవగాహన కాదు. సామాన్యముగ, మానవుడు స్వార్ధజీవి! అతడు ఏ కార్యము చేపట్టినా, అందు స్వలాభాపేక్షే యిమిడి ఉంటుంది! అందువలననే సమాజశ్రేయస్సనే విశాల దృక్పధాన్ని మరచిపోతున్నాడు. కేవలం తనకాయుష్షు, తనకారోగ్యమన్న స్వార్ధ చింతనతోనే జీవిస్తున్నాడు. ఇట్టి సంకుచిత, స్వార్ధచింతన జీవనము మానవుని గమ్యానికి చేర్చలేదు: అసలు గమ్యమంటే ఏమిటో తెలిస్తేనే గదా! దైవ నిర్దేశిత కార్యక్రమాన్ని నిర్వర్తిస్తూ సమాజసేవలో జీవనం గడిపి, దైవాన్ని చేరుకోవడమే మానవ జీవిత పరమార్ధము! అందుకే మానవునిలో స్వార్ధముకన్న పరమార్ధమే మిన్నయన్న భావము ప్రోది చేసికోబడాలి! వసుధైక కుటుంబములో తాను ఒక భాగమేయన్న వాస్తవ విషయాన్ని గ్రహించాలి. ఇతరుల సుఖశాంతులే తనవిగా భావించాలి! "పరుల కలిమికి ఏడ్చేపాపికెక్కడ సుఖముకలదోయ్" అన్న గురజాడ వారి పలుకులకిదే పరమార్ధము. కావున పరుల సంపదను జూచి ఈర్ష్యచెందరాదు. ఇతరుల కష్టాలలో పాలుపంచుకొని, వారిని ఊరడించాలి. ఓదార్చాలి! నీటమునిగిపోయే వ్యక్తి

సోమంచి రామం

మిత్రుడైనా, శత్రువైనా రక్షించడానికే సమాయత్తం కావాలి! ఆపదలందున్న వారిని ఆదుకొనేందుకే మనిషి ఆరాటపడాలి! ఆత్రుత చెందాలి.

మానవుడు సమాజానికి మంచి చేయడమే గాకుండా సమాజంలో చెలరేగే చెడును సైతం సరిదిద్దాలి. కనీసం సరిదిద్దే ప్రయత్నమైనా ప్రారంభించాలి! తనకు లభించిన సిరిసంపదలు దైవదత్తములని భావించాలే గాని, స్వార్జితములని, స్వాతిశయించరాదు. అందుకని ఆ సంపదను దైవకార్యాలకే వినియోగించాలి! సాటి మానవసేవయే దైవకార్యము! విశాలహృదయము, నిస్వార్ధ బుద్ధి, పరోపకారచింతన అన్నవి మహాపురుషుల జీవితాలు మనకు బోధించేసద్గుణాలు. మానవుని మేధా సంపత్తి అపారమేకావచ్చును. కాని అంతమాత్రాన పరిపూర్ణ శక్తిమంతుడని గర్వపడరాదు. సానబెట్టబడే వజ్రములా, అనుభవము కొద్దీ ఈ మేధాశక్తి పదునుకెక్కుతుంది. శాస్త్ర గ్రంధాల, పురాణేతిహాసాల, పఠనము వలన ఈ అనుభవాలను సంపాదించ వచ్చును. దీనికి మనిషి వయస్సుతో నిమిత్తము లేదు. సద్గ్రంధ పఠనమే మానవుని సన్మార్గ దీపిక. పఠనమే కాదు. శ్రవణమూ ప్రధానమే. "వినదగు నెవ్వరు చెప్పిన వినినంతనె వేగిరపడక" అన్నట్లు, చెప్పేవారెవరైనా, ఓపిగ్గా వినాలి. విన్నదానిలోని మంచి చెడులను గ్రహించే వివేకము అలవర్చుకోవాలి. వీనికి తోడుగ నిల్చే అమూల్య విషయమే సజ్జన సాంగత్యము, సత్కార్య సాధనము, సన్మార్గ జీవనము, సత్శీల నిర్మాణము - ఈ సజ్జన సాంగత్యము వలన సంప్రాప్తించే సద్గుణాలు. ఈ విధముగ సత్ప్రయోజనకారి, సన్మార్గ దర్శిని అయిన జీవనం గడిపే మానవుని జీవితమే చరితార్ధము. అదే మానవ జీవిత పరమార్ధము.



# శ్రీ శివసాయి అకామిడేషన్

మొదటి రెండవ అంతస్తులో, కుమార్ విలాస్ హోటల్‌కాంప్లెక్సు పైన,

గోపురం ప్రక్కన, **పుట్టపర్తి - 515 134**

*ప్రశాంతి నిలయం S.S. హాస్పిటల్, M.R.O. ఆఫీస్,*
*గోకులం దగ్గరలో గల ప్లాట్స్, అపార్టుమెంట్స్, ఫారం లాండ్స్ అమ్మకము*
*మరియు కొనుగోలుకు సంప్రదించండి.*

**ఒక్కసారి రూ. 10,116/- లు చెల్లించిన 10 సంవత్సరముల వరకు ప్రతి సంవత్సరమునకు 60 రోజుల వంతున డోర్ నెం. 324, కుమార్ విలాస్ పై రెండు అంతస్తులు, గోపురంగేటు ప్రక్కన, గోపురంరోడ్ వద్ద ఉచిత వసతి సౌకర్యము లభించగలదు.**



**శివసాయి అకామిడేషన్స్ ప్రారంభించబడినది.**

**వాయిదా పద్ధతిలో ప్లాట్లు మరియు అపార్ట్‌మెంట్సు కూడా లభించును.**

ప్రొప్రయిటర్స్:

**గ్రంధి యుగంధర్, చుండూరి వెంకటేశ్వరరావు** B.A

# వీరాధివీరుడు

పూర్వం విశాఖపట్నం జిల్లా అడవులలో కొండలరావు అనే పేరుగల కోయనాయకుడు ఉండేవాడు. అతని భార్య రుక్మిణి. కొండలరావు స్వతహాగా చాలా పిరికివాడు. కానీ శ్రీ సత్యసాయిబాబా భక్తుడు. ప్రతిరోజూ శ్రీ సత్యసాయిబాబాకి పూజలు చేస్తూనే ఉండేవాడు.

ఒకసారి కోయగూడెం చుట్టూ ఉన్న అడవులలోకి ఒక పెద్దపులి వచ్చి కనపడ్డ ప్రతివారిని పొట్టనబెట్టుకో సాగింది. "దొరా! ఆ పెద్ద పులి బారినుండి మమ్మల్ని కాపాడు దొరా! ఆ పెద్దపులిని చంపుదొరా!" అని గూడెంలోని కోయవాళ్ళు అందరూ కొండలరావు దగ్గరకు వచ్చి మొరపెట్టుకున్నారు. గత్యంతరంలేని కొండలరావు "సరే" అని వారికి అభయం యిచ్చేడు.

ఆ సాయంకాలం కొండలరావు "ఈ ఆపద నుండి ఎట్లాగైనా కాపాడు స్వామీ!" అని మనస్ఫూర్తిగా శ్రీ సత్యసాయిబాబాకి నమస్కరించేడు. సాయంకాలం భార్య రుక్మిణితో భోజనం ముగించి, మేకపోతు గాంభీర్యంతో, ఈటె తీసుకుని వేటకు బయలుదేరాడు. రుక్మిణి 'ఏమండీ! నేను కూడా మీతో వేటకు వస్తానండి' అన్నది. "సరే. రా!" అన్నాడు కొండలరావు. కొండలరావూ, రుక్మిణీ యిద్దరూ చీకటిపడిన తరువాత అడవిలోకి వెళ్ళి పొదచాటున నక్కారు.

అర్ధరాత్రి కావస్తుండగా తనకు బాగా దగ్గిరలో కొండలరావుకు పులిగాండ్రింపు వినబడింది. కొండలరావుకి వెంటనే భయంతో స్పృహతప్పి పోయింది. కొంచెంసేపటికి స్పృహవచ్చి చూస్తే, తనకు బాగా దగ్గిరగా ఒక ఆకారం కనిపించింది. కొండలరావు వెంటనే తన ఈటెని, ఆ ఆకారం దిశగా విసిరి పరుగెత్తుకుంటూ గూడెంలోని తన పూరి యింటికి పరుగుతీసేడు. వెన్నెల్లో తన భార్య గూడా తనవెనకే పరుగెత్తి వస్తున్నట్లు కనిపించింది అతనికి. కొండలరావు తన పూరియింటిలోకి వచ్చి, తన మంచం మీద ముసుగుతన్ని పడుకున్నాడు. తన భార్య కూడా మరో మంచంమీద పడుకోవటం అతను చూసేడు.

తెల్లవారిన తరువాత గూడెంలోని ప్రజలు పులిశవాన్ని ఊరేగిస్తూ కొండలరావు యింటికి వచ్చేరు. "వీరాధివీరుడివి దొరా!" పులిని ఒట్టి చేతులతో గొంతుపిసికి చంపేవు. వీరుడివి అంటే నువ్వే దొరా" అని అతన్ని పొగిడి పులి శవంతో వెళ్ళిపోయినారు.

## చింతపల్లి అన్నపూర్ణ

ఆ రోజు అంతా రుక్మిణి కుంటుతూ ఉన్నట్లు ఆమె జబ్బలమీద గాట్లు కొండలరావు గమనించేడు. చివరికి రుక్మిణితో "రాత్రి పులిని చంపింది నువ్వే కదూ" అన్నాడు. "అవును. మీరు స్పృహ తప్పిపడి ఉన్నప్పుడు అది మీ మీదకు దూకబోతూ ఉంటే నేనే దాని గొంతు పిసికి చంపేను" అన్నది రుక్మిణి. "మరి నేను విసిరిన ఈటె?" అన్నాడు కొండలరావు. "నా తొడలో దిగబడింది. ఇదుగో గాయం" అన్నది రుక్మిణి తన తొడమీద గాయాన్ని కొండలరావుకు చూపుతూ.

"నన్ను క్షమించగలవా?" అన్నాడు కొండలరావు రుక్మిణితో. "ఎంతమాట! మీరే నన్ను క్షమించాలి. మీరే నాదేముడు" అన్నది రుక్మిణి కొండలరావుతో అతని పాదాలకు నమస్కరించి. "మీరు శ్రీ సత్యసాయిబాబాకి చేసిన ప్రార్థన విన్నాను. అందుకే మొండి ధైర్యంతో మిమ్మల్ని అనుసరించేను. పులిని చంపేశక్తిని నాకు శ్రీ సత్యసాయిబాబాయే యిచ్చేడు" అన్నది రుక్మిణి.

"పులిని మీరే చంపేరు. పులిని చంపింది నేనే అన్న రహస్యం మన యిద్దరి మధ్యే ఉండిపోవాలి" అన్నది రుక్మిణి. "అట్లాగే" అన్నాడు కొండలరావు. "సాయంత్రం అడవికి వెళ్ళి ఈటె తెచ్చుకోండి" అన్నది రుక్మిణి. "అట్లాగే" అన్నాడు కొండలరావు మళ్ళీ. ✳

## మంచి అవకాశము

87215
S.T.D. 08555



# శ్రీసాయిహరి రియల్ ఎస్టేట్స్

## పుట్టపర్తి

మీకు పుట్టపర్తి యందు ప్లాట్లు ఇండ్ల స్థలాలు కావలసినవారు, అమ్మదలచినవారు
ఈ క్రింది అడ్రసుకు సంప్రదించవలెనని కోరడమైనది.

1. సూపర్ స్పెషాలిటి హాస్పిటల్ ఎదురుగా గల ప్లాట్లు.
2. గోకులం పోస్టాఫీస్ ఎదురుగా గల ప్లాట్లు.
3. M.R.O. ఆఫీసు ఎదురుగా గల ప్లాట్లు.
4. బీడుపల్లికి పోవు బస్సు రోడ్డుకు గల ప్లాట్లు.
5. అపార్ట్‌మెంట్స్ కావలసినవారు.
6. ప్రశాంతి నిలయము దగ్గరలో గల ప్లాట్లు.

**ప్రతినెలా 10వ తేదీన వాసవీ నివాస్ నందు డ్రా తీయబడును.**

క్రొత్తగా ప్రవేశపెట్టిన స్కీములో చేరండి 20X40 రెండు సెంట్లకు
నెలకు రు. 600-00. 36 నెలలు. "మారుతీ కారు బంపర్ డ్రా"

ఇట్లు
శ్రీ సాయి హరి రియల్ ఎస్టేట్స్
**ప్రొ॥ పి. సిద్దయ్య శెట్టి**
ఆర్యవైశ్య సంఘము వైస్ ప్రెసిడెంట్
**ఆర్యవైశ్య సత్రం ఫ్రంట్ రూమ్, పుట్టపర్తి**